C1

# సిఐటియు రాష్ట్ర మహాసభల సందర్భంగా సాహితీస్రవంతి ఆధ్వర్యంలో హైదరాబాద్ లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో నిర్వహించిన జనకవనం దృశ్యాలు



జనకవనం ప్రారంభోపన్యాసం చేస్తున్న కె. శివారెడ్డి







సభాధ్యక్షులు తెలకపల్లి రవి, సిఐటియు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఆర్. సుధాభాస్కర్, నిఖిలేశ్వర్, ఎస్వీ. సత్యనారాయణ, కవి యాకూబ్








జనకవనంలో కవితలు చదువుతున్న జి. యాదగిరి రావు, వెంకటి, శాంతిశ్రీ, కెంగార మోహన్, జి. నరేష్, సి.హెచ్. లీల








ఎ. వెంకటేశం, సింహాద్రి శిరీష, టి. కిశోర్, యం.డి. ఖాజామెయినుద్దీన్, కర్లపాలెం భాస్కర రావు, నడిమింటి లక్ష్మీనారాయణ, కందుకూరి రాజ్యలక్ష్మి



జనకవనం ముగింపు సమావేశంలో ప్రసంగిస్తున్న సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి. చిత్రంలో జనకవనం సమన్వయం చేసిన రఘుబాబు, వీరప్రసాద్, వల్లభాపురం జనార్దన, స్ఫూర్తి, భూపతి వెంకటేశ్వర్లు


జనకవనానికి హాజరయిన కవులు, సాహిత్యాభిమానులు

ఫోటోలు: గేరా

PRSVIM02A140

సాహిత్య ప్రస్థానం
ఆగష్టు 2012
సంపుటి : 11 సంచిక : 08

# మహాసభలు, సందోహాలు

**వ**చ్చే డిసెంబరులో తిరుపతిలో ప్రపంచ తెలుగు మహాసభలు జరుపుతామని మంత్రివట్టి వసంతకుమార్ ప్రకటించారు. అకాడమీలను పునరుద్ధరిస్తామని కూడా సూచించారు. వీటిపై రకరకాల స్పందనలు వుండటం సహజం. ప్రభుత్వ ఆధ్వర్యంలోని సాంస్కృతిక మండలి, తెలుగు విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమీ వంటి వాటి నిర్వహణకు సంబంధించి అనేక విమర్శలున్నాయి. సూచనలూ వున్నాయి. తెలుగు భాషా పరిరక్షణ పేరుతో సాగే రకరకాల ఉద్యమాలు, ప్రాంతాల వారీ కదలికలు, ప్రవాస భారతీయుల ప్రయత్నాలు వీటన్నిటి వల్లా ఈ అంశానికి గతం కన్నా ప్రాధాన్యత ఏర్పడింది.

కళాసాహిత్యాలను సాంస్కృతికాంశాలను ప్రోత్సహించేందుకు ఎలాంటి కృషి జరిగినా మంచిదే. అయితే అది కేవలం ప్రభుత్వ ప్రచారార్భాటానికో, కొద్ది మంది వ్యక్తుల స్వలాభానికో సోపానం కాకూడదు. సుసంపన్నమైన తెలుగు సాహిత్య సంస్కృతులను ముఖ్యంగా ప్రజా సాహిత్య స్రవంతిని భాషాధ్యయనాన్ని ముందుకు తీసుకుపోయేదిగా వుండాలి. ఇప్పటికే కొంతమంది భాష సాహిత్యాల పేరిట తిరోగామి ధోరణులు పైరవీ ప్రహసనాలకు వత్తాసునిస్తున్నారు. లక్ష కోట్ల పైబడిన బడ్జెట్‌లో తెలుగు భాషా సాహిత్య సంస్కృతుల వాటా నామకార్థపు విదిలింపుగానే వుండిపోతున్నది. ఉన్న కాస్తలోనూ సద్వినియోగం అవుతున్నది మరీ తక్కువ. తెలుగుకు ప్రాచీన హోదా పేరిట సాగిన ఉద్యమం చివరకు జయప్రదమైనా ఆ నిధులు వచ్చాయో లేదో వస్తే ఏమయ్యాయో తెలియని అయోమయం.

కనుక కేవలం సాహిత్య కోణంలోనే గాక సామాజిక దృష్టితో చూసినా తలపెట్టిన కార్యక్రమాలు సరైన దిశలో నడిచి సత్ఫలితాలిస్తాయని ఆశించాలి.

బొమ్మలు : చంద్ర, శివాజీ, వెంకటేష్

## ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వీరప్రసాద్
వల్లభాపురం జనార్దన

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
Prasthanam_ss@yahoo.co.in
www.prasthanam.com



కథ

# వర్షించిన మానవత్వం

సింహాద్రి నాగశిరీష

సెల్ : 9866689326

**ఆఫీసు నుంచి బయటకు రాగానే నాకు గుండె ఆగినంతపనైంది. దట్టంగా మబ్బుపట్టి ఉంది. ఏ క్షణంలోనైనా చినుకులు దాడి చేయటానికి సిద్ధంగా ఉన్నాయి. తడవకుండా ఇంటికి చేరటం అసాధ్యమని తెలిసి కూడా ఏదైతే అదౌతుందిలే అనుకుంటూ మొండిగా బండి స్టార్ట్ చేశాను. అలా కొంతదూరం వెళ్ళానో లేదో చిన్ని చిన్ని చినుకులు సుతారంగా నా మేనిని తాకాయి. ఎంతో హాయిగా అనిపించింది. ఆ చినుకుల స్పర్శను ఆస్వాదించేలోపే ట్రాఫిక్ జామ్. కళ్ళు మూసి తెరిచేలోపే పద్మవ్యూహంలో చిక్కిన అభిమన్యుడిలా అయింది నా పరిస్థితి.**

ఎటూ కదలటానికి లేదు. అంతలోనే చినుకులు కాస్త ఉధృతరూపు దాల్చి సూదుల్లా శరీరాన్ని గుచ్చసాగాయి. ఇలాగైతే లాభంలేదనుకొని, ఎలాగో తిప్పలు పడి ఓ పక్కగా బండిని పార్క్ చేసి, అక్కడే ఓ షాప్ ముందు నిలబడ్డాను. నాలాగే కొంతమంది అక్కడకు చేరారు. వాహనాల మోత ఒకవైపు, జడివాన మరోవైపు, వెరసి కాస్త చికాకు. టూకీగా ఇది మొత్తం మీద నా పరిస్థితి. ఈ గండం తప్పించుకుని ఎలా బయటపడాలిరా దేవుడా అని ఆలోచిస్తూ నిలబడిన నా దృష్టి రోడ్డుకు ఆవలివైపు ఉన్న ఓ చెత్తకుప్పపై పడింది. ఎవరో నలుగురు యువకులు ఆ చెత్తలో ఏదో వెతుకుతున్నారు. వారి శరీరంపై ఆచ్ఛాదన పూర్తిగా కూడా లేదు. ఇద్దరికి శరీరంపై ఓ ప్యాంటు ఉంది. మూడవవాడికి ఓ నిక్కరు, ఇక నాల్గవవాడికి ఒంటినిండా బట్టలైతే ఉన్నాయి. కానీ ఆ బట్టలు అతని శరీరాన్ని కాపాడుతున్నాయా లేక శరీరమే ఆ బట్టలను కాపాడుతోందా అన్నంతగా చిరుగులు ఉన్నాయి. మొత్తం మీద వాళ్ళ వాలకం చూస్తే మాత్రం ఏ చిత్తుకాగితాలో, కవర్లో ఏరుకునే వారు అయి ఉంటారని నిర్ధారించుకున్నాను. ఆ వానలో, చెత్తకుప్పలను చేతితో పెళ్ళగిస్తూ కావలసిన వాటిని ఏరుకుంటూ, సరదాగా కబుర్లు చెప్పుకుంటూ, ఒకరినొకరు తోసుకుంటూన్న వారిని చూస్తే ఎలా స్పందించాలో నాకు అర్థంకాలేదు. కంపుకొట్టే ఆ చెత్తలో చేతులు పెడుతున్నందుకు అసహ్యించుకోవాలో, ఆ చెత్తలో కూడా కేరింతలు కొట్టగలుగుతున్నందుకు ఆశ్చర్యపడాలో తెలియలేదు కానీ వాళ్ళనుంచి దృష్టి మాత్రం మరల్చలేకపోయాను.

రోడ్లపై నీరు వరదలను తలపిస్తోంది. ఆ చెత్తకుప్పకు కొంతదూరంలో ఓ భవనం కాంపౌండ్‌వాల్‌ను అనుకొని ఓ పెద్ద చెట్టు వుంది. ఆ చెట్టు తప్ప అక్కడ తలదాచుకునేందుకు మరేమీ లేదు. ఇంతలో కొంతమంది కాలేజ్ స్టూడెంట్స్ ఆ నీటి ప్రవాహంలో బైక్ నడపటం సాధ్యంకాక కాంపౌండ్‌వాల్ ప్రక్కగా బైక్‌లు పార్క్ చేసి చెట్టుకిందకు చేరారు. వర్షం ఉధృతి క్షణక్షణానికీ పెరుగుతోంది. ఆ చెత్త ఏరుకునే కుర్రవాళ్ళు కూడా నెమ్మదిగా ఆ చెట్టు కిందకు చేరారు. వారు అలా వచ్చారో లేదో, ఈ కాలేజ్ స్టూడెంట్స్ చిరాకుగా వారివైపు చూసి, చేతులను ముక్కుకు అడ్డంగా పెట్టుకొని, అసహ్యంగా ముఖకవళికలు మార్చి, ఏదో గొణుక్కుంటూ బైక్‌లు స్టార్ట్ చేసి అలాగే తడుచుకుంటూ వెళ్ళిపోయారు. కాలేజ్ స్టూడెంట్స్ ప్రవర్తించిన తీరుకు ఆ చెత్త ఏరుకునే కుర్రవాళ్ళకు ఏమనిపించిందో తెలియదు కానీ నాకు మాత్రం ఎక్కడో ఓ మూల బాధతో నా హృదయం మూలిగినట్లు అనిపించింది. బహుశా వారు ఇలాంటి ఛీత్కారాలతో కూడిన

చూపులు, మాటలు, చేష్టలకు అలవాటుపడిపోయి ఉంటారు. ఇంతలో వాన కాస్త తెరపిచ్చింది. యధావిధిగా ఆ కుర్రవాళ్ళు చెత్తకుప్పవైపు దారి తీశారు. నేను కూడా బయలుదేరుదామని నెమ్మదిగా బండివైపు నడిచాను. కానీ బండిని ఎటూ కదిలించవీల్లేకపోయింది. రేషన్‌షాపులో బియ్యంకోసం బారులు తీరినట్లు టూ, త్రీ, ఫోర్ అన్ని వీలర్లూ ఆగిపోయినాయి. అక్కడికి నాలుగడుగుల దూరంలో చౌరస్తా ఉంది. నాలుగు దిక్కులా ఇదే పరిస్థితి కావటంతో సిగ్నల్ పడినా ట్రాఫిక్ క్లియర్ కావటం కష్టంగా ఉంది. ఇక బండిని కదిలించినా ఫలితం ఉండదని తెలిసి ప్రక్కనే నిలబడ్డాను.

మొత్తానికి ఓ అరగంట సుదీర్ఘయాతన తర్వాత గానీ ఓ మోస్తారుగా ట్రాఫిక్ క్లియరయింది. కానీ ఏం లాభం ఈలోపు మళ్ళీ వాన పుంజుకుంది. అసహనంగా నిట్టూరుస్తూ, ఆ ప్రయత్నంగా అవతలవైపు చూశాను. సరిగా అప్పుడే ఆ చెట్టు దగ్గర ఓ స్కూటర్ ఆగిపోయింది. ఆ స్కూటరిస్టుతోపాటు అతని భార్య ముగ్గురు పిల్లలు ఉన్నారు. ఆ పిల్లల్లో ఒకరు నెలల పసిగుడ్డు, నడకకూడా సరిగా రాని పాప, ఓ నాలుగేళ్ళ పసివాడు. ఇటు చూస్తే వర్షం. ఇక చేసేదిలేక భార్యా బిడ్డల్ని ఆ చెట్టు క్రింద నిలబెట్టి ఆటో కోసం చూస్తూ అలా వర్షంలో తడుస్తూ నిలబడ్డాడు ఆ స్కూటరిస్టు. అప్పటికే పెద్ద వర్షం కురిసి ఉండటంతో, ఆ చెట్టు తలదాచుకునే వీలు కల్పించకపోగా, ఆకుల మీదుగా ఇంకా ఎక్కువగా నీళ్ళు కారుతున్నాయి. వర్షం నుంచి ఆ పసివారిని కాపాడలేక ఆ తల్లి చాలా ఇబ్బంది పడుతోంది. ఇదంతా చూస్తూ ఉండటం తప్ప ఏమీ చేయ వీలులేకుండా పోయింది. ఎందుకంటే అక్కడ ఎవరివద్దా గొడుగులేదు. పోనీ వారిని ఇవతలకు తేవాలన్నా, పిల్లలు ముద్దగా తడిచిపోవడం ఖాయం. ఇంతలో ఆ చెత్త ఏరుకునే కుర్రవాళ్ళు కూడా చెట్టుకిందికి చేరారు. ఆ తల్లి అవస్థను చూసి ఏమనుకున్నారో కానీ గబగబా చెత్త కుప్ప వైపు పరిగెత్తారు. వారలా ఎందుకు పరిగెత్తారో అర్థంకాక ఆత్రంగా అటే చూస్తూ నిలబడ్డాను. అలా వెళ్ళిన వారు ఒక పెద్ద చెక్కముక్క తీసుకొని వచ్చారు. కాంపౌండ్‌వాల్‌కు, చెట్టుకు మధ్యలో ఈ తల్లీ బిడ్డలను నిలబెట్టి వారు తడవకుండా పైనుంచి చెక్కను ఉంచి, అది పడిపోకుండా ఇద్దరు కుర్రాళ్ళు చేతులతో ఎత్తిపెట్టారు. ఆ పసివారిని వర్షం నుంచి కాపాడాలని దాదాపు గంట, గంటన్నరసేపు ఎత్తిన చేతులు దించకుండా, వాళ్ళు వర్షంలో తడుస్తూ అలాగే నిలబడ్డారు. మిగిలిన ఇద్దరు కుర్రాళ్ళూ ఆటో, కారు ఇలా ఏ వాహనం కనిపించినా ఆపాలని ప్రయత్నిస్తూనే ఉన్నారు. కానీ వర్షం తగ్గేవరకూ ఏ ఒక్క వాహనమూ ఆగలేదు. వారు ప్రయత్నమూ మానలేదు. అలా ఆ నలుగురు కుర్రాళ్ళూ తోటివారికి సాయం చేయాలని పడుతున్న తపన, అవస్థ చూస్తే మధ్యాహ్నం ఆఫీసులో జరిగిన ఓ చిన్న సంఘటన గుర్తొచ్చింది.



నేనొక మీడియాలో ప్రొడక్షన్ వర్క్ చేస్తుంటాను. డ్యూటీలో భాగంగా యూత్‌కు సంబంధించిన ఓ కార్యక్రమంలో ఓ అంధ యువకుడు పాడుతున్న కర్నాటక సంగీతం రికార్డ్ చేయాల్సి వచ్చింది. వాస్తవానికి ఆ యువకుడి రికార్డింగ్ నిన్ననే జరగవలసింది. బస్సులు దొరక్క వారు స్టూడియోకు వచ్చేసరికి, వాద్య సహకారం అందించేవారు డ్యూటీ టైం ఐపోవటంతో వెళ్ళిపోయారు. ఆ యువకుడి తల్లి కూలి పనిచేస్తుంది. రికార్డింగ్ కోసమని కూలి పని మానుకుని, హాస్టల్‌కు వెళ్ళి అతడిని అంత శ్రమపడి తీసుకువచ్చినా ఫలితం లేకపోయింది. దాంతో ఆ రికార్డింగ్ ఈ రోజు మధ్యాహ్నానికి మార్చారు. పాపం ఆ యువకుడు ఈ రోజు ఎలాగైనా పాడాలనే తపనతో రికార్డింగ్ రెండు గంటలకైతే ఒంటి గంటకే వచ్చి కూర్చున్నాడు. అతను వచ్చిన విషయం తెలిసి వెయిటింగ్ రూంకి వెళ్ళాను. అతనితో పాటుగా మరో అంధుడు ఉన్నాడు. విషయం ఆరాతీస్తే తెలిసింది ఏమిటంటే ఆ ముసలి తల్లికి నలుగురు కొడుకులు. ఆ నలుగురూ అంధులే. ఈ యువకునితో వచ్చింది అతని అన్న అని తెలిసి కొంచెం బాధ. అతనిపై గౌరవం కలిగాయి. అక్కడే కూర్చుంటే ఈ రోజు కూడా రికార్డింగ్ మిస్సవుతుందేమో అని భయపడి, కొంచెం అలికిడి అయినా సరే ఎవరో వచ్చారనుకొని "సార్ కొంచెం స్టూడియోకి తీసుకెళ్ళరా! రికార్డింగ్ ఉంది" అని ఆ యువకుడు అడుగుతున్న తీరు అందరినీ చలింపజేసింది. నేను నెమ్మదిగా వారిని సమీపించి, నన్ను నేను పరిచయం చేసుకున్నాను. ఎటువంటి టెన్షన్ పడకుండా అక్కడే ఉండమని, రికార్డ్ చేసేది నేనేనని, ఆర్టిస్టులంతా వచ్చిన తర్వాత నేనే దగ్గరుండి స్టూడియోకు తీసుకువెళ్తానని చెప్పి, వారిని శాంతపరచి వెళ్ళిపోయాను. అన్నపానాదులు ముగించుకుని, నెమ్మదిగా రెండున్నరకు వాద్య సహకారం అందించే ఉద్దండపిండాలు స్టూడియోకు వచ్చారు. నేను వెళ్ళి ఆ యువకుడిని స్టూడియోలో కూర్చొండబెట్టి వచ్చాను. రికార్డింగ్ మొదలయింది.

మొదటి కీర్తన ముగిసింది. రెండవ కీర్తనలో ఆ యువకుడు కొంచెం తడబడ్డాడు. ఓ పక్క అతను పాడుతుంటే ఈ ఉద్దండ పిండాల ముఖంలో హేళనతో కూడిన నవ్వులు. అదంతా చూస్తున్న నాకు చాలా ఇబ్బందిగా అనిపించింది. ఆ హేళనతో కూడిన ముఖకవళికలు బహుశా ఆ యువకుడు చూడగలిగితే తప్పకుండా బాధపడేవాడు. కానీ పాపం అతనికి చూపు లేదుగా ఆ క్షణం అతను అదృష్టవంతుడు అనుకున్నాను. చివరిగా మూడవ కీర్తన అందుకుని, చరణంలో ఓ పంక్తి మరచిపోయి, అతను వణికిపోతున్నాడు. సాధారణంగా ఎంతబాగా పాడగల్గిన వారైనా సరే ఒక్కోసారి ఏదో ఒక ఇబ్బంది కారణంగా ఒక్కో కీర్తన పూర్తిచేయటానికి దాదాపు అరగంట, గంట పట్టిన సందర్భాలూ లేకపోలేదు. దాంతో నేను ఆ కీర్తన మళ్ళీ మొదటి నుంచి రికార్డ్ చేయటానికి సన్నద్ధమౌతుండగా, స్టూడియోలోంచి మా ఉద్దండపిండాలు నన్ను రమ్మనట్లు సైగ చేశారు. ఏంటీ అని లోపలికి వెళ్తే అర్జెంటుగా ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌ను పిలుచుకురమ్మని ఆదేశం. వెళ్ళి ఆయనను తీసుకువచ్చాను. వచ్చి చూస్తే ఏముంది? స్టూడియో బయట వణుకుతూ ఆ అంధ యువకుడు. ఆ ఉద్దండ పిండాల్లో ఒకరు తాను ససేమిరా వాయించనని, వాద్యాన్ని అక్కడ వదిలేసి వెళ్ళిపోయాడట. చివరికి ఎలాగో ఆయన్ను వెతికి పట్టుకున్నాం. వారి వాదన ఏంటంటే, అసలా కుర్రాడికి శృతి, లయ అనేవి లేవనీ, అలా శృతీ, మతీ లేని సంగీతానికి



## జూలై నెల పురస్కారాలు



| | |
|---|---|
| **కాలక్షేపం** | **ఒక సన్నివేశం** |
| కథకు........రూ.700/- | కవితకు.......రూ.500/- |
| రచయిత : ముక్కామల దేవీ నాగమోహనరావు | రచయిత : వడలి రాధాకృష్ణ |

**సినీ రచ... త జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**
మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

వాద్య సహకారం అందించి విద్యను అవమానించలేమని ఒకరు, అసలా కీర్తనలు ప్రసారానికి అనర్హమని మరొకరు.

మా ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌కు వారిని ఎలా శాంతింపచేయాలో అర్థం కాలేదు. రికార్డ్ చేసిన రెండు కీర్తనలూ విన్నారు. నిజానికి అతడు పాడిన కీర్తనలు ప్రసార యోగ్యంగానే ఉన్నాయి. ఆ ఉద్దండ పిండాలకు అదే మాట చెప్పే సాహసం మాకెవ్వరికీ లేదు. వారు గత కొన్ని దశాబ్దాలుగా వేళ్ళతో సహా పాతుకుపోయి ఉన్నారు. వారు చెప్పిందే వేదం. ఇక ఎటూ పాలుపోక కనీసం అతని అంధత్వాన్ని, పేదరికాన్ని చూసి అయినా కాస్త కనికరించమని ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ అభ్యర్థించాడు. కానీ వారు ససేమిరా అన్నారు. అసలు ప్రవేశానికే అర్హతలేని వాడిని సెలక్ట్ చేయటమే తప్పని, ఈ ప్రోగ్రాం ప్రసారం చేసిన పక్షంలో హెడ్ ఆఫీస్‌కు అంతా కలిసి కంప్లయింట్ చేస్తామని, అతనికి సాయమే కావాలంటే తలా ఓ వంద ఇస్తామని చాలా నిర్దాక్షిణ్యంగా మాట్లాడుతున్నవారిని చూస్తే అసహ్యంవేసింది.



ఆ కుర్రవాడు మాత్రం వణికిపోతూ, “ఒక్క అవకాశం ఇవ్వండి సార్ మళ్ళీ పాడతాను. ఈసారి చాలా జాగ్రత్తగా పాడుతాను. అంటూ వంగి దండం పెడుతూ ప్రాధేయపడుతున్న తీరు చూస్తే, ఏమీ చేయలేని నా నిస్సహాయతపై నాకే అసహ్యం వేసింది.

ఎంతో పెద్ద విద్వాంసుల వారసులమని చెప్పుకుంటూ, పేరులో తప్ప విద్యలో పసలేని ఎంతోమంది కళాకారులను చూస్తూ కూడా చూడనట్లే ఉన్నాం. ఎంతో పేరు వచ్చిన తర్వాత కూడా ఒంట్లో సత్తువ లేకపోయినా ఇంకా ఇంకా కళను ప్రదర్శించి పేరు తెచ్చుకోవాలనే అత్యాశతో పాడటానికి గొంతు లేవకున్నా, ఆడటానికి ఒళ్ళు సహకరించకున్నా ప్రదర్శనలు ఇచ్చే కళాకారులను టిక్కెట్లు కొనుక్కుని మరీ ఆహా ఓహో! అంటున్నాం. చేతిలో దండిగా కాసులున్నవారు, ఎదురు డబ్బు ఇచ్చి మరీ కళలను చీల్చి చెండాడుతుంటే మనసును ఓదార్చుకు మరీ నోరెత్తకుండా కళ్ళు మూసుకుంటున్నాం. కళాపిపాస అని సరిపెట్టుకుంటున్నాం. అలాంటిది రోజుకూలి కెళ్తే కూడా గుప్పెడు మెతుకులు నోటికి చేరని స్థితిలో అంధులైన బిడ్డలను సాకుతున్న ఆ తల్లి కష్టం మాత్రం అర్థం చేసుకోలేకపోతున్నాం. వాళ్ళ కాళ్ళు, వీళ్ళ కాళ్ళు పట్టుకొని విద్య నేర్చుకొని అంగవైకల్యాన్ని లెక్కచేయకుండా, నాలుగు రాళ్ళు సంపాదించి, తల్లికి భారం తగ్గించాలనే ఆశతో వచ్చిన ఆ అంధుడి రాగంలో అపశ్రుతులు మాత్రం చాలా స్పష్టంగా చూడగలుగుతున్నాం. నిర్దాక్షిణ్యంగా తప్పులు వేలెత్తి చూపగలుగుతున్నాం. ఎంతైనా మనుషులం కదా !?

ఇక ఆ అంధ యువకుడు ఎంత బ్రతిమాలినా పాడటానికి ఒప్పుకోకుండానే చెక్కు ఇచ్చి ఏదో నచ్చజెప్పి పంపారు. కానీ ఈ ఉద్దండపిండాలు అంతా తేలిగ్గా ఎలా నెమ్మదించారా అనుకున్న నాకు అసలు విషయం తెలిసి స్థాణువయ్యాను. ఏవో కారణాలు చూపించి, యాజమాన్యంతో పోట్లాడి ఇక ముందు స్టూడియోలో అతనిని అడుగుపెట్టనివ్వకుండా చేసి ఆ పేద వికలాంగుడి కడుపుకొట్టారు. ఈ విషయం తెలిసిన నాకు, చెక్ తీసుకున్న తర్వాత ఆ అంధుడు తన అన్నతో అన్న మాటలు గుర్తొచ్చాయి.

“అన్నయ్యా! నేను బాగా పాడలేకపోయినా చెక్కు ఇచ్చిన మంచోళ్ళు వీళ్ళు. ఈసారి బాగా ప్రాక్టీస్ చేసి వస్తానన్నా.” కానీ అతను అనుకున్న ‘ఈసారి’ ఇక రాదని తెలిస్తే ఏమౌతాడో అన్న ఆలోచనకు అప్రయత్నంగా నాకళ్ళు వర్షించాయి. ఇంతలో సడన్‌గా ఎవరో పెద్దగా హారన్ కొట్టటంతో ఉలిక్కిపడి లోకంలోని వచ్చాను. వర్షం తగ్గిపోయింది. తలెత్తి చూస్తే ఎదురుగా కుర్రాళ్ళు మొత్తం మీద ఎలాగో ఓ ఆటోను ఆపి తల్లీ పిల్లలను క్షేమంగా పంపారు. స్కూటరిస్టు, ఆ కుర్రవాళ్ళకు థ్యాంక్స్ చెప్పి పర్సులోంచి ఓ నోటు తీసి ఇవ్వబోయాడు. దానికి వాళ్ళు ఓ చిరునవ్వు నవ్వి, మళ్ళీ ఆ చెత్త కుప్ప వద్దకు వాళ్ళకు కావలసింది వెతుక్కుంటున్నారు ఎప్పట్లాగే నవ్వుతూ.... కేరింతలు కొడుతూ... ♦

# స్పాన్సర్ ఖడ్గం

ఐనంపూడి శ్రీలక్ష్మి
9989928562



ఎవరో ఒకరు చెపితే నేను వినలేను
దారి చూపితే నేను వెళ్ళలేను
సపోర్ట్ చేస్తే నే నడవలేను
యుగ యుగాల జీవన ప్రస్థానాన్ని
నాకు నేను గానే సాగించాను
కోట్లాది గుండెల స్పందనల్ని
నాలోంచి నేనే పల్లవింప చేసాను

సింధు నదిని జడగా వేసుకుని
హరప్పా మొహంజదారో మందారాలను తురుముకుని
మగధ, హస్తినాపురం, ఓరుగల్లు, రాయగిరి ఖిల్లాల మీదుగా
కోట్లాది మనసుల జీవనాదినయ్యాను
నా సొంత తనాన్ని జాతి పతాక చేసాను
ఖాళిఘాట్ మచిలీపట్టణం – ఢిల్లీ – ముంబై – చెన్నైలలో
నువ్వు దిగబడ్డాక నీ ఒడల నిండా
కబ్జావాదాన్ని – కానింగ్ స్వామ్యాన్ని దిగుమతి చేసాక
నా ఆకాశం నిండా నీ మబ్బులను పరుగెట్టించాకా
మీరట్‌గా – బెంగాల్‌గా దండిగా – చిట్టగాంగ్ కొండలుగా –
మేమంతా అనువిస్ఫోటనం అయ్యాం
మా అస్తిత్వ సూర్యుడి వెలుగులలో
మీ కృత్రిమ మేఘాలను ఛిద్రం చేసాం
ఈ నేలపై మా ఆశల వృక్షాలను మొలకెత్తిన్నాం

మళ్లీ ఇన్నాళ్ళకు –
కొత్త ముసుగేసుకుని మెరుపుల తళుకులతో నువ్వొచ్చావ్
ఇంతకు ముందు నీ స్వార్థాన్ని ఇంపోర్ట్ చేసావు
ఇప్పుడేమో మా ఆకాంక్షల్ని స్పాన్సర్ చేస్తానంటున్నావ్

ఈ స్పాన్సరింగ్ నాగాస్త్రం మా మట్టినంతా మెస్మరైజ్ చేసింది
నీ సౌజన్యపు మిస్సైల్ ఐసోసైనేడ్
ఇప్పుడీ గాలినంతా ఆక్రమించేసింది.
నువ్వేసిన స్పాన్సరింగ్ విత్తనానికి
ఇప్పుడు శతకోటి రూపాలు
టీవీల్లో – వేదికల్లో – కార్పోరేట్ కంపెనీల్లో
కన్నీటి ఓదార్పుల్లో – ట్రాఫిక్ జాముల్లో – జాతరల్లో
జాబిలి వెలుగుల్లో – సాంస్కృతిక ఉత్సవాల్లో – సంప్రదాయంలో
నీ స్పాన్సరర్ షిప్ ఊపిరిగా మారింది
కొత్త అవసరాలను సృష్టించి అవకాశాలను ఉరకలెట్టించి
ఎన్ని భౌతిక సంస్కృతులను – మరిన్ని భౌగోళిక ఆకృతులను
నువ్వు స్పాన్సర్ చేసినా నీ స్పాన్సరేంద్ర జాలం
నా సంకల్పం ముందు తుత్తునియలు కాకమానదు

ఎవరో చెపితే నేను వినలేను
ఎవరో చూపిన దారిలో నడవలేను
ఎవరి చేతుల్లోని రిమోట్ కో నేను ఛానెల్ చేంజ్ చేయలేను.

---

# ముళ్లదారి

సి.హెచ్. మధు



తిరస్కరణ ఒక ఆయుధంగా మారినప్పుడు
ముళ్ల చెట్టును నరకటం సులభమే అవుతుంది
రాళ్ల దెబ్బల నడ్డుకోవటం బాధవుతుంది
తిరస్కరణ ఆయుధమే కాదు
ఒక దారి
జనం కన్నీటి ప్రయాణానికి చరమాంకం పాడే
ఓదారి
ఇక్కడ రాజీ పడటం కుదరనిపని
తోటంతా కాలిపోయిన తర్వాత
బస్మాసురునితో మాటలేమిటి?
పాటను నిర్బంధించిన తర్వాత
దుర్యోధనులతో సంధి ఏమిటీ?
ఏది బాగుందని తలకెత్తుకోవటానికి?
ఏది కడుపునింపిందని జైహింద్ అనటానికి!
అడుగడుగూ ఆకలికేకలు
మైలు రాళ్లు దాటకుండానే
అప్పుల ఆత్మహత్యల రోదనలు
ప్రజాస్వామ్య భావజాలం నీడలా
పెరిగిన అంతరాలు
దోపిడితో రాజీపడటం దోచుకోవటానికే !
ప్రజలను దోచుకునేవాడు
సమానత్వం, ఆధునికత ఏది మాట్లాడినా
వాడే నిజమైన దొంగ
తిరస్కరణ ఇపుడు నా ముందున్న
ముళ్లదారి ప్రయాణం తప్పదుగా !



'పడవ ప్రయాణం' కథారచయిత
పాలగుమ్మి పద్మరాజు

# 'పడవ ప్రయాణం'లో పురుషాధిక్య ధోరణి

- రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

పాలగుమ్మి పద్మరాజు కథల్లో 'గాలివాన' తర్వాత అంత ప్రాచుర్యం పొందిన కథ 'పడవప్రయాణం' ఈ కథ 1945 నాటిది. అప్పటికి భారతీయులు. క్విట్టిండియా ఉద్యమంలో తలమునకలుగా ఉన్నారు. తెలుగువాళ్ళు దానికితోడు తెలంగాణ విమోచనోద్యమంలో కూడా వీరోచిత పోరాటం చేస్తున్నారు. ఈ నేపథ్యంతో 'పడవ ప్రయాణం' కథకేమీ సంబంధం లేదు. ఇది పేదల కథ కాని, పేదరికం కాదు. ఇది శ్రామికుల కథే గాని శ్రమ జీవన కథనంకాదు. ఇది రంగి, పద్దాలు అనే ఇద్దరు పేద శ్రామిక స్త్రీ పురుషుల కథ. ఈ యిద్దరూ పెండ్లి తంతు లేకుండా సహజీవనం చేస్తున్న కథే. ఇంతవరకే అయితే దానిని గొప్ప అభ్యుదయ కథ అనో, గొప్ప స్త్రీవాద కథ అనో అనవచ్చు. 'స్వేచ్ఛ' నవలలో ఉమ, శ్రీధర్‌ల జీవితం వంటి జీవితాన్ని ఆ నవల కన్నా నాలుగు దశాబ్దాలకు ముందే చిత్రించిన కథగా కీర్తించవచ్చు. కాని ఈ కథలోని రంగి, పద్దాలు సంబంధాలలో స్త్రీలకు నష్టంచేసే అంశాలున్నాయి.

రంగిని పద్దాలు లేవదీసుకుపోయాడు. ఆ విధంగా వాళ్ళు వివాహ వ్యవస్థనూ ధిక్కరించారు. రంగి పద్దాలుకు నమ్మకంగా కాపురం చేస్తున్నది. కాని పద్దాలు మాత్రం రంగికి విధేయంగా లేదు. పద్దాలు రంగి ఉండగా మరొక 'గుంట'తో సంబంధాలు పెట్టుకున్నాడు. రహస్యంగా కాదు. బహిరంగంగానే. సంబంధం పెట్టుకోవడమే కాకుండా ఆమెను రంగి దగ్గరకే తీసుకొచ్చి ఆమె ముందే ఆ గుంటతో సరసాలాడుతుంటాడు. రంగి గొడవ చేసి బయటకు పంపించింది. బయటకు పంపగలిగిందే గాని, వాళ్ళ సంబంధాలను నివారింప లేకపోయింది. పద్దాలు రంగికి తాగుడునేర్పాడు. దొంగతనం నేర్పాడు. మొగుడు ఒక వ్యవస్థ. ఆ వ్యవస్థ ఏమి చేయగలదో పద్దాలు అదే చేశాడు. రంగి దొంగతనం చేసి తెచ్చేదంతా పద్దాలు ఆ గుంటకే తీసుకుపోయి ఇస్తాడు. పద్దాలు రంగిని విపరీతంగా తిడతాడు, కొడతాడు. రంగి దగ్గరున్న నాను పేటను రెండో గుంటకు ఇచ్చెయ్యమని పీడిస్తాడు. రంగి తిరస్కరిస్తే, అర్ధరాత్రిపూట ఆమెనిద్రపోతున్నప్పుడు ఇంటికి అగ్గి పెట్టేస్తాడు. రంగిని గాయాలుతో ఎవరో ఆసుపత్రిలో చేర్పిస్తారు. పోలీసులు వచ్చి ఎవరిమీదనైనా అనుమానముందా అని అడిగితే, రంగి పద్దాలు మాత్రం కాదని చెబుతుంది. పద్దాలు రంగి శరీరాన్ని మాత్రమే కాదు, ఆమె శ్రమనూ దోచుకున్నాడు. ఆమె ఆత్మగౌరవాన్ని తిరస్కరించాడు. ఆమె ప్రాణాన్ని కూడా తీసే ప్రయత్నం చేశాడు.

పద్దాలుతో ఇంత ప్రతికూల అనుభవముండి కూడా రంగి ''ఆడు నా వోడు'' అని అనుకుంటుంది. ''మొగోడికెంత మందయితేమాత్రమేం?" అని ప్రశ్నిస్తుంది. "ఆడండి మారాజండి" అని కూడా అంటుంది" అంతేకాదు "వొందమందితో పోయినాసరే ఆడునాకాడికొచ్చి తీరతాడు. నేను లేకపోతే గుండగిలి సచ్చిపోడూ" అని నమ్ముతుంది. ''ఎన్ని తిరుగుళ్ళు తిరిగినా నావోడు నాదగ్గరకేవొత్తాడు" అని తనలో తాను అనుకుంటుంది. "అందులో ఒక ఆశ, ఒక ధైర్యం, ఒక విశ్వాసం తొణికిసలాడాయి" అంటాడు కథకుడు. రంగికి పద్దాలు పట్ల అంతగట్టి అభిప్రాయం, దృఢమైన విశ్వాసం కారణం, పద్దాలు రంగికి చేయవలసిన నష్టాలన్నీ చేసేసి, అప్పుడప్పుడు వచ్చి ఆమె ముందు ఏడవడమో వాడి ఏడుపుతో రంగి కరిగిపోతుంది. రెండో గుంట మీద మోజుతీరినప్పుడు తన దగ్గరకే వస్తాడని రంగి నమ్ముతుంది. అప్పటిదాకా నిరీక్షించడమే తన పని అనుకుంటుంది. ఆ గుంట మీద పద్దాలుకు మోజు తీరేదెన్నడు? ఆ గుంట రంగికన్నా వయసులో చిన్నది. ఆ గుంట మీద మోజు తీరాలంటే ఆమె పెద్దదైపోవాలి. ఈ లోపల రంగి కూడా పెద్దదైపోతుంది. పద్దాలు ఈ యిద్దరికన్నా పెద్దవాడైపోతాడు. ఈ లోపల రంగి జీవితసారమంతా కోల్పోతుంది. జీవితానందమంతా పోగొట్టుకుంటుంది. రంగి మొగాడి దొంగ ఏడుపులు చూచి కరిగిపోయి తన జీవిత సుఖాలను పోగొట్టుకుంటుంది. పద్దాలు జీవితావసాన దశలో ఏ ఆకారంలో తిరిగొస్తాడో! ఎలా వచ్చినా నావోడు తిరిగొచ్చాడని రంగి సంతసిస్తుంది.

ఇది పూర్తిగా పురుషాధిపత్యాన్ని, పురుషాహంకారాన్ని సమర్థించే కథ, ఆమోదించే కథ. ఆధునిక వచనంలో ఉన్న ప్రాచీన పతివ్రత కథ. ఈ 'పడవ ప్రయాణం' స్త్రీలను న్యాయమైన ఒడ్డుకు చేర్చదు.

**రచయిత సెల్ : 9440222117**

# తెలుగు సంస్కృతిపై బౌద్ధమత ప్రభావం

-ప్రొ॥ వెలమల సిమ్మన్న



వైదిక సంప్రదాయంలో కర్మకాండ, జ్ఞాన కాండలు ప్రధానమైనవి. కర్మకాండ రూపమైన యజ్ఞ యాగాదుల్లో జంతుహింస పెచ్చు పెరిగిపోవడం వల్ల ప్రజలకు వైదిక మతం పట్ల వ్యతిరేకత బయలుదేరింది. మతాలకు సంబంధించిన ఘర్షణలు బయలు దేరాయి. రాను రాను భారతీయ సమాజంలో ప్రజలు అశాంతికి లోనైనారు. ఆ సమయంలో జైన, బౌద్ధమతాలు ఆవిర్భవించాయి. ఈ రెండు మతాల సిద్ధాంతాలు చరిత్రను కొత్త మార్గం వైపు నడిపించాయి.

"బుద్ధం శరణం గచ్ఛామి/ధర్మం శరణం గచ్ఛామి/సంఘం శరణం గచ్ఛామి" అనే ఆదర్శాల ద్వారా మానవుని వ్యక్తి వికాసానికి తోడ్పడడమే కాక, సమిష్టి శ్రేయస్సుకు సమన్వయం సాధించే ప్రయత్నం చేసింది బౌద్ధం. అంచేత బౌద్ధం ప్రపంచ వ్యాప్తంగా బహుళ ప్రచారం పొందింది.

బౌద్ధం ప్రపంచ మానవాళికి అత్యున్నతమైన మానవతా వాదాన్ని ప్రబోధించిందని చెప్పడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. ప్రపంచంలో ఏ ప్రాంతం వారైనా, ఏమతస్థులైనా సర్వకాలాల్లోనూ, సర్వావస్థల్లోనూ, ఆచరించడానికి వీలైన మానవతావిలువలు బౌద్ధంలో పుష్కలంగా వున్నాయి. బౌద్ధమత మహాప్రవక్త గౌతమ బుద్ధుడు.

సమాజంలో కొందరు వారి వ్యక్తిగత ఆనందం కోసమే జీవించి కాలగర్భంలో కలిసిపోతారు. మరికొందరు వారి కుటుంబ సంక్షేమమే లక్ష్యంగా మనుగడ సాగించి మరుగున పడిపోతారు. చాలా తక్కువమంది ప్రజాశ్రేయస్సే జీవిత లక్ష్యంగా ఆశయంగా బ్రతికి, ప్రజలకు ఆదర్శంగా నిలిచి చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతారు. ఈ మూడో శ్రేణిలో మొదటి మహోన్నత వ్యక్తి నాటికీ నేటికి ఎన్నటికీ గౌతమబుద్ధుడేనని చెప్పక తప్పదు. ఆయన ఆసియా ఖండపు "అఖండజ్యోతి" గానే కాక, ఈ సమస్త భూమండలానికి "జ్ఞాన సూర్యుడు"గా వెలుగొందుచున్నాడు. అదే ఆయన గొప్పతనం, విశిష్టత కూడా.

ప్రపంచంలో అనేక మతాలు చోటు చేసుకున్నాయి. అందులో బౌద్ధం, జైనం, హిందూ, క్రైస్తవం, ఇస్లాం మతాలు ప్రధానమైనవి. వాటిలో అత్యంత ఆదర్శవంతమైంది బౌద్ధమతం. అందుకే భారతదేశంలో ఎందరో రాజులు, కవులు, రచయితలు, బౌద్ధమతాన్ని అనుసరించి అనుకరించి, ఆచరించి విస్తృతంగా ప్రచారం చేశారు.

క్రీ॥పూ॥ 6వ శతాబ్దంలో ప్రపంచధార్మిక చరిత్ర విప్లవాత్మకమైంది. ఆనాటి సమాజంలోని కరుడు గట్టిన మూఢాచారాన్ని ఖండించారు. కొత్త సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టారు. మీదు మిక్కిలి ప్రచారం కూడా చేశారు. గ్రీసులో సోక్రటీస్, చైనాలో కన్‌ఫ్యూషియస్, భారతదేశంలో వర్ధమానుడు, గౌతముబుద్ధుడు తమతమ బోధనలచే ప్రజల్లో నూతన చైతన్యాన్ని కలిగించారు.

చాలా ప్రాచీన కాలం నుంచి భారతదేశంలో వైదిక మతం ప్రచారంలో వుంది. వైదిక సంప్రదాయంలో కర్మకాండ, జ్ఞాన కాండలు ప్రధానమైనవి. కర్మకాండ రూపమైన యజ్ఞ యాగాదుల్లో జంతుహింస పెచ్చు పెరిగిపోవడం వల్ల ప్రజలకు వైదిక మతం పట్ల వ్యతిరేకత బయలుదేరింది. మతాలకు సంబంధించిన ఘర్షణలు బయలు దేరాయి. రాను రాను భారతీయ సమాజంలో ప్రజలు అశాంతికి లోనైనారు. ఆ సమయంలో జైన, బౌద్ధమతాలు ఆవిర్భవించాయి. ఈ రెండు మతాల సిద్ధాంతాలు చరిత్రను కొత్త మార్గం వైపు నడిపించాయి.

ఆ కాలం నాటి పరిపాలకులు ఎక్కువమంది బౌద్ధాన్ని ఆదరించారు. ఆ కారణంగా బౌద్ధమతానికి అనన్య సాధారణమైన వ్యాప్తి కలిగింది. ఈ వ్యాప్తికి దోహదం చేసినవి ముఖ్యంగా లిఖిత సాహిత్యం, వాగ్రూపమైన ప్రచార సాధనాలు. క్రీ॥పూ॥ 6వ శతాబ్ది నుండి దాదాపు ఆరువందల సంవత్సరాలు భారతీయ సమాజాన్ని అత్యంత ప్రభావితం చేసింది. ఆ కాలంలో ఉత్తరా పథాన్ని పరిపాలించిన హర్యంక, మౌర్య, కుషాణులు, దక్షిణాదిన పరిపాలించిన శాతవాహన, ఇక్ష్వాకులు బౌద్ధాన్ని విస్తృత వ్యాప్తి చేశారు. మహోన్నతమైన మానవతా విలువలు వుండడం వల్ల బౌద్ధం మనదేశంలోనే కాక తూర్పు

ఆసియాలోని అనేక దేశాల్లోనూ బహుళ ప్రజాదరణాన్ని పొందింది.

బుద్ధుడు కరుణావతారంగా ప్రపంచంలో ప్రసిద్ధుడు. భగవంతుడు, వర్ణ వ్యవస్థ, వేద శాస్త్రాలు వీటిని గూర్చి బుద్ధుని ఆలోచనలు తమకు పూర్తిగా విరుద్ధంగా వున్నప్పటికీ వైదిక మతస్థులు బుద్ధుడిని తొమ్మిదవ అవతారంగా గుర్తించారు. అంతేకాదు ఈ యుగాన్ని బౌద్ధయుగం పేరుతో ప్రసిద్ధికెక్కించారు. జయదేవుడు తన మధురగేయ కావ్యం "గీత గోవిందమ్"లో పదవ అవతారాన్ని కీర్తిస్తూ ఎంతో భావ భరితమైన పదాల్లో బుద్ధుడుని కీర్తించాడు.

ఆంధ్రజాతి నిర్మాణంలో సమాజ పరిణామంలో సంస్కృతి వికాసంలో బౌద్ధ ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది. అనాగరికులు, క్రూరవర్తనులైన తెగల్ని నాగరిక జీవిత విధానానికి మరలించడంలో బుద్ధుడు జీవితాంతం కృషి చేశాడు.

బౌద్ధం విస్తరిస్తున్న కాలంలోనే ఆర్య సంస్కృతి దక్షిణ దేశానికి విస్తరించింది. ఆర్య భూముల్లో కంటే ఆనార్య భూముల్లో బౌద్ధం వేగంగా వ్యాప్తి చెందింది. బౌద్ధం వల్ల ఆంధ్ర సంస్కృతిలో ఆసక్తికరమైన సంప్రదాయాలు నెలకొల్పబడ్డాయి. బౌద్ధం పునాదుల్ని పటిష్ఠం చేసి బౌద్ధ ధర్మ విస్తరణకు బౌద్ధులు కృషి చేశారు. నిజానికి బౌద్ధం పుట్టింది ఇక్కడ కాకపోయినా బౌద్ధ వికాసానికి తెలుగునాడు కేంద్రంగా నిలిచింది. అయితే తమతమ విద్వేషాలతో మనవాళ్ళే ఒకరి గ్రంథాన్ని మరొకరు తగల బెట్టుకున్నారని చరిత్ర చెపుతుంది.

ఆంధ్రదేశంలో జైన క్షేత్రాల కంటే బౌద్ధ క్షేత్రాలు విశిష్టమైన నిర్మాణాలతోనూ, సర్వాంగ సుందరమైన శిల్ప సంపదతోనూ, ఆకర్షణీయాలై, ఆంధ్ర సంస్కృతీ చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని పొందాయి. అలాంటి బౌద్ధ క్షేత్ర శిథిలాలు అరవైకి పైగా బయల్పడ్డాయి.

ఆంధ్రదేశంలోని బౌద్ధ క్షేత్రాలన్నింటిలో విశ్వ విఖ్యాతి గడించింది ధాన్య కటకం. ప్రస్తుతం ఈ ప్రాంతాన్ని అమరావతి అని వ్యవహరిస్తున్నారు.

ప్రాచీనతలో, పరిణామంలో, పవిత్రతలో ధాన్యకటక స్థూపం తర్వాత చెప్ప దగింది భట్టిప్రోలు.

ఆంధ్రదేశంలో ఏకైక గుహావిహారం గుంటుపల్లి కొండలో వుంది.

విశాఖపట్నం జిల్లాలో అనకాపల్లికి రెండు మైళ్ళ దూరంలో శంకరం గ్రామానికి ఉత్తర దిశలో బొజ్జన్నకొండ లింగాలమెట్ట అనే కొండలు వున్నాయి. శంకరం అనేమాట సంఘారామానికి, బొజ్జన్న కొండ బుద్ధన్న కొండకు మారు రూపాలు.

శాలిహుండం శ్రీకాకుళం జిల్లాలో శ్రీకాకుళానికి 12మైళ్ళ దూరంలో వంశధార నదిపై వుంది. ఈ గ్రామానికి దక్షణ దిశలో వున్న కొండపైన సువిశాలమైన బౌద్ధ క్షేత్రం వెలిసివుంది.

రామతీర్థం విజయనగరానికి 8 మైళ్ళ దూరంలో వుంది. ఈ గ్రామానికి ఉత్తర దిశలో వున్న గురుభక్త కొండ, దుర్గ కొండలపై బౌద్ధజైన శిథిలాలు విస్తరించి వున్నాయి. గురుభక్త కొండపై ఆరు ముద్రలు ఒక శాతవాహన నాణెం దొరికాయి.

ఘంటశాల కృష్ణా జిల్లాలో మచిలీపట్నానికి 13 మైళ్ళ దూరంలో వుంది.

గుంటూరు జిల్లా పన్నాడు తాలూకాలో రెండ చింతలకు మూడు మైళ్ళ దూరంలో ప్రవహిస్తున్న గోలివాగు ఒడ్డున గోలిగ్రామం వుంది.

కృష్ణా జిల్లాలో రామిరెడ్డి పల్లికి సమీపంలోని గుమ్మడి దుర్ర కొండపై విస్తృతమైన బౌద్ధ క్షేత్ర శిథిలాలు బయటపడ్డాయి.

కృష్ణాజిల్లా యెర్రుబాలెం రైలు స్టేషన్‌కు నాలుగు మైళ్ళ దూరంలో అల్లూరు గ్రామం వుంది. అక్కడ 1926లో స్థూప శిథిలాన్ని తవ్వి వెలుగులోకి తెచ్చారు.

ఆంధ్రదేశంలోని బౌద్ధ క్షేత్రాలన్నింటిలో విస్కృతమైంది నాగార్జున కొండ. మూడు వైపులా పర్వతశ్రేణులు మరోవైపు కృష్ణానది వుండి, కొన్ని మైళ్ళ విస్తీర్ణం వున్న ఈ లోయలో సర్వ లక్షణాలతో 30కి పైగా బౌద్ధ విహారాలు వర్ధిల్లాయి.

తీరాంధ్రంతో పోలిస్తే పశ్చిమాంధ్ర దేశంలో అంటే తెలంగాణా, రాయలసీమల్లో బౌద్ధ క్షేత్రాల సంఖ్య చాలా స్వల్పం. అందుకు కారణం ఆ ప్రాంత ఆర్థిక పరిస్థితులే.

తెలంగాణా ప్రాంతంలోని దూళికట్టి, ఘణిగిరి, గాజులబండ, ఇటీవల బయల్పడిన నేలకొండపల్లి, రాయలసీమ ప్రాంతంలోని చందవరం ముఖ్యమైనవి.

తెలుగుదేశం నలుమూలలా తీరం వెంబడి శాలిహుండం (శ్రీకాకుళం జిల్లా), మొదలు రామతీర్థం (ప్రకాశం జిల్లా), వరకూ పశ్చిమాంధ్రలో దూళికట్టి (కరీంనగర్ జిల్లా) నుంచి ఆదాపూర్ (కడప జిల్లా) వరకూ బయల్పడిన, బయల్పడుతూ వున్న బౌద్ధ క్షేత్ర శిథిలాలు ఒకనాడు బౌద్ధం పొందిన విస్తృత జనాదరణకు నిదర్శనం.

ఆంధ్రుల్లో నాగ, యక్షజాతులు బౌద్ధంపట్ల ప్రత్యేక ఆదరాన్ని ప్రదర్శించారు. ఆంధ్రదేశంలో ఈ వర్గాల వారు బౌద్ధ మతాన్ని ఆదరించి పోషించారు. అతి ప్రాచీన కాలంలోనే అంటే బుద్ధుని జీవిత కాలంలోనే ఆంధ్రదేశంలో ప్రవేశించిందని బౌద్ధ వాఙ్మయం సాక్ష్యంగా నిలుస్తుంది. గోదావరి తీరాన అస్సక జనపద బ్రాహ్మణుడు బావలి తన 16 మంది శిష్యుల్ని బుద్ధుని బోధనలు విని రమ్మని శ్రవస్తి పంపినట్లు సుత్తనిపాతం పేర్కొంది. ఆంధ్రప్రదేశంలో శాతవాహన, ఇక్ష్వాక రాజవంశాలు బౌద్ధాన్ని పోషించాయి.

ఆంధ్ర బౌద్ధాన్ని పోషించిన వారిలో అధిక సంఖ్యాకులు శెట్టి, గహపతి, కర్మకార వర్గాల ప్రజలు. అమరావతి, భట్టిప్రోలు, నాగార్జున కొండ, ఘంటశాల, గుంటుపల్లి మొదలైన చోట్ల లభించిన శాసనాలు చాలా భాగం ఈ వర్గాల వారు చేసిన దాన ధర్మాల్ని నమోదు చేసినవే. అట్టగుడున వున్న వర్గాల ప్రజలు బౌద్ధం పట్ల ప్రదర్శించిన అభిమానం వ్యక్తమవుతుంది. రాణివాస స్త్రీలే కాక, పై వర్గాల స్త్రీ జనం సయితం అధిక సంఖ్యలో బౌద్ధ సంస్థల్ని పోషించారు. వీరు చేసిన దానాల్ని బట్టి ఆలోచిస్తే నాడు స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం వున్నట్లు తెలుస్తుంది. బౌద్ధాన్ని ఆదరించి పోషించిన వర్గాల వల్ల ఆంధ్రప్రదేశ్ బౌద్ధం ఒక ప్రజాస్వామ్యంగా వ్యాప్తి చెందింది. చివరకు బౌద్ధం ఆంధ్రదేశంలో 12వ శతాబ్దం వరకు చూడగలిగింది.

ఆంధ్రదేశాన్ని అత్యంత వైభవంగా పాలించిన శాతవాహన చక్రవర్తులు అమరావతిలో చైత్య నిర్మాణాన్ని చేసి, తమ బౌద్ధ మతాను రక్తిని ప్రదర్శించారు. తర్వాత వచ్చిన ఇక్ష్వాకులు అదే మార్గాన్ని అనుసరించారు. శాతవాహనుల కాలంలో శ్రీ పర్వతంపై నాగార్జునుడు వుండేవాడు. అదే నాగార్జున కొండ అయింది. ఇతడు బౌద్ధ వేదాంతి, రసాయన శాస్త్రజ్ఞుడు, పండితుడు, బహు గ్రంథకర్త, "విగ్రహవ్యావర్తని", "సుహృల్లేఖ" అనే ఇతని బౌద్ధ రచనలు సంస్కృతంలో వెలువడ్డాయి.

**బౌద్ధమతం సిద్ధాంతాలు :**

1. కార్యకారణ సిద్ధాంతం (భావ చక్రం)
2. చతురార్య సత్యాలు (ఫోర్ నోబుల్ ట్రూత్స్)

| | |
|---|---|
| 1. దుఃఖం | 3. దుఃఖోపశమనం |
| 2. దుఃఖహేతువు | 4. దుఃఖోపశమనానికి మార్గం |

**3. అష్టాంగ మార్గం :**

| | |
|---|---|
| 1. సమ్యక్ దృష్టి | 5. సమ్యక్ కర్మ |
| 2. సమ్యక్ సంకల్పం | 6. సమ్యక్ వ్యాయామం |
| 3. సమ్యక్ జీవనం | 7. సమ్యక్ స్మృతి |
| 4. సమ్యక్ వాక్ | 8. సమ్యక్ సమాధి |

**4. అనాత్మ సిద్ధాంతం**

**5. పంచఖండ సిద్ధాంతం**

| | |
|---|---|
| 1. రూపం | 4. సంస్కారాలు |
| 2. వేదన | 5. విజ్ఞానం |
| 3.సంజ్ఞ | 6. కర్మ సిద్ధాంతం |
| 7. నిర్మాణం | 8. అహింసా సిద్ధాంతం |
| 9.సర్వమానవ సమత్వం | |

**బౌద్ధ మతం - శాఖలు :**

బౌద్ధమతంలో రెండు శాఖలు వున్నాయి. 1. మహాయానం. 2. హీన యానం. మహాయానంలో బుద్ధుడు మానవ మాత్రుడు కాడు. దేవుడే. శాశ్వతుడు, బాధితులైన ప్రజలకు విమోచన కలిగించి, వారిని ఉద్ధరించడానికి బుద్ధుడు భూలోకంలో అవతరించాడని మహాయాన బౌద్ధుల విశ్వాసం.

హీనయానులకు బుద్ధుడు మానవుడే కాని, అతిలోక మహాశక్తి సంపన్నుడైన మానవాతీతుడు. హీనయానంలో బుద్ధుడు, ధర్మం, సంఘం. బౌద్ధులకు శరణ్యం. మహాయాన బౌద్ధులు కూడా ఈ త్రిరత్నాల్ని అంగీకరిస్తారు. అయితే వారికి ధర్మం శాశ్వతమైంది. బుద్ధుని కంటే ధర్మానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారు. బౌద్ధమత సారమిది.

నేడు బౌద్ధం మనదేశంలో నామమాత్రంగానే వుంది. చైనా, జపాన్, కొరియా, టిబెట్, వియత్నామ్, బర్మా, థాయ్‌లాండ్, కంబోడియా, లావోస్, శ్రీలంకలలో వ్యాప్తిలో వుంది.

**బుద్ధుని బోధనలు :**

| | |
|---|---|
| 1. అహింస | 4. తృష్ణా నివారణం |
| 2. విశ్వ మానవ ప్రేమ | 5. అరిషడ్వర్గ విజయం |
| 3. దేశ జన సేవ | 6.శాంతి, కరుణ, సత్య సౌశీల్యాదులు |

బుద్ధుడు మానవులందరికీ చేసిన బోధనలో ప్రేమ, స్వేచ్ఛ, సమత, సహోదరత మొదలైన సామాజికమైన సందేశమే వుంది.

బుద్ధుని బోధనలు నాటికి నేటికి ఏనాటికైన విశ్వ మానవాళికి విజ్ఞాన పథాన్ని చూపతగినవి, సర్వదా ఆచరింపదగినవి. బుద్ధుని బోధనలు సార్వ కాలికాలు. సార్వ జనీనాలు.

**సంస్కృతిలో భాగం కళలు.** కళలు 64. అందులో లలిత కళలు ఐదు 1. సాహిత్యం 2. సంగీతం 3. శిల్పం 4. చిత్ర లేఖనం 5. నాట్యం ఈ కళల్ని బౌద్ధం, జైనం, వీరశైవం, వైష్ణవం, మొదలైన మతాల వారు పోషించారు. ఆయా మతాలు వారు దైవారాధనకూ, మత వ్యాప్తికీ ఈ కళల్ని ఉపయోగించారు. మతం వల్ల కళలు వ్యాప్తి చెందాయన్నది సత్యం. ముఖ్యంగా శిల్పకళ ఆంధ్రప్రదేశ్‌లోనే కాదు, భారతదేశంలోనే కాక, ప్రపంచమంతా వ్యాప్తి కావడానికి బౌద్ధమే కారణం. తెలుగునాడు చిరకాలంగా శిల్పకళకు ప్రసిద్ధి చెందింది. అమరావతి, నాగార్జున సాగర్ మొదలైన ప్రదేశాల్లో ప్రత్యక్షమయ్యే బౌద్ధ శిల్పాలు దేశీయుల్నే కాక విదేశీయుల్ని కూడా మంత్ర ముగ్ధుల్ని చేశాయి.

**వివిధ భాషల్లో బౌద్ధ సాహిత్యం :**

బౌద్ధ ధర్మ ప్రభావం భారతదేశంలోని, అన్ని భాషా సాహిత్యాల్లోనూ బాగా వ్యాపించింది. పాళీ, సంస్కృతం, హిందీ, తమిళం, ఆంగ్లం, తెలుగు మొదలైన భాషల్లో బౌద్ధ సాహిత్యం పుష్కలంగా వెలువడింది. బౌద్ధం సామాన్య ప్రజలకు ఉద్దేశించడం వల్ల సామాన్యుల వాడుక భాషల్లోనూ బౌద్ధ సాహిత్యం సృష్టించబడింది.

ప్రాచీన పురాణాల్లోనూ, భాగవతంలోనూ, బుద్ధావతార ప్రసక్తి వుంది. కాశీ ఖండంలోనూ బుద్ధుడు శ్రీ మహావిష్ణువు అవతారం అని చెప్పబడింది. తెలుగు సాహిత్యంలో మనకు బౌద్ధాన్ని ప్రస్తావించిన మొదటి గ్రంథం పాల్కుకి సోమనాథుని "పండితారాధ్య చరిత్ర".

సంస్కృతిలో భాగం కళలు. అందులో సాహిత్యం ఒకటి. తెలుగు సాహిత్యంలోని అన్ని ప్రక్రియల్లో బౌద్ధ ప్రభావం బాగా గోచరిస్తుంది.

బుద్ధ భగవానుని జీవిత విశేషాల్ని ధర్మోపదేశాన్ని అనేకమంది కవులు కావ్యాలుగా మలిచారు. దీనికి కారణం 1. దారుణ మారణ హోమంలో మగ్గిపోయిన మానవజాతికి బుద్ధుని అహింసా సిద్ధాంతం చల్లని వెలుగు నిచ్చింది. 2. గాంధీయుగంలో అహింసా సిద్ధాంతం వినూత్నమైన జీవ సత్యాన్ని సంతరించుకుంది. 3. వైదికమైన జ్ఞాన, కర్మ మార్గాల కంటే బుద్ధుడు బోధించిన దయానురాగాల సమస్త మానవాళికి సులభతరమై, ప్రశాంత జీవితం గడపడానికి అందుబాటులో వుంది.

తెలుగులో బౌద్ధ ప్రభావంతో అనేక ప్రక్రియాల్లో రచనలు వచ్చాయి :

| | |
|---|---|
| 1. పద్య కావ్యాలు లేదా ప్రబంధాలు | 6. ఖండకావ్యాలు |
| 2. గద్య కావ్యాలు | 7. ధర్మ పదం |
| 3. యక్షగానాలు | 8. జాతక కథలు |
| 4. నాటకాలు | 9. శతకాలు |
| 5. గేయ కృతులు | 10. బుర్ర కథలు |

**1. పద్య కావ్యాలు :**

| | |
|---|---|
| తిరుపతి వేంకట కవులు | - బుద్ధ చరిత్ర |
| పింగళి కాటూరి కవులు | - సౌందర నందం |
| జంధ్యాల పాపయ్య శాస్త్రి | - కరుణశ్రీ |
| గుంటి సుబ్రహ్మణ్య శర్మ | - విశ్వజ్యోతి |
| దాశరథి | - మహాబోధి |
| కరుటూరి సత్యన్నారాయణ | - కరుణాసౌగతం, ఆమ్రపాలి, తిష్యరక్షిత |
| చర్ల గణపతి శాస్త్రి | - బుద్ధ భగవానుని చరిత్ర |
| సిద్ధయ కవి | - బుద్ధ హృదయం మహాభి నిష్క్రమణం |
| పెన్మత్స రాజంబాబు | - బుద్ధ పురాణం |
| వంగవోలు ఆదిశేష శాస్త్రి | - యశోధర |
| యం.పి. జాను కవి | - బుద్ధ చరిత్ర |
| డా.వి.వి.యల్ నరసింహారావు | - ఆనంద భిక్షువు |

బొద్దులూరి నారాయణరావు - శాంతి పథం
కొండా రామచంద్రా రెడ్డి - ప్రాగ్జ్యోతి
సురగాలి తియోతి జ్ఞానాందకవి - ఆమ్రపాలి
ఆచార్య కె.వి.ఆర్. నరసింహం - సుజాత
విద్యార్ జక్కా వేంకటేశ్వరుడు - విష్ణు రక్షిత
శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు - ధర్మ దీక్ష

**2. గద్య కావ్యాలు :**

కిళాంబి రంగాచార్యులు,
సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి - జాతక కథాగుచ్ఛం
తల్లావఝుల శివశంకర శాస్త్రి - బుద్ధ భగవానుని జాతక కథలు
మల్లంపల్లి సోమశేఖర శర్మ - అమరావతి స్థూపములు
చారిత్రక వ్యాసముల బౌద్ధయాగం
ఓ.వై. దొరసామయ్య - గౌతమ బుద్ధ చరిత్రం
చిలకమర్తి - సిద్ధార్థ చరిత్ర
దాసు నారాయణ రావు - బుద్ధ నీతి
కొండా పార్వతీదేవి - విశ్వ జ్యోతి

**3. యక్షగానం :**

బండ్ల సుబ్రమ్మ కవి - బుద్ధ చరిత్ర

**4. నాటకాలు :**

పానుగంటి వారు - బుద్ధ బోధ సుధ
కొండముది గోపాల రామశర్మ - గౌతమబుద్ధ
రూపకగూడి నారాయణ రావు - గౌతమ బుద్ధుడు
మల్లయశ్రీ - శాంతి పథం
సర్వేపల్లి పెంచలయ్య - ఆచార్య నాగార్జున
ఆచార్య ఆత్రేయ - గౌతమ బుద్ధ

**5. గేయకృతులు :**

బసవరాజు అప్పారావు - యశోధరా విలాపం
జంధ్యాల పాపయ్య శాస్త్రి - యశోధర
సి.నా.రె. - నాగార్జున సాగరం
జువ్వాడి గౌతమ రామ - మృత్యుంజయం
బాలాంత్రపు వారు - గేయ ఖండికలు
సత్యప్రియ - బుద్ధ సంస్కృతి
అద్దేపల్లి రామమోహనరావు - సంఘం శరణం గచ్ఛామి

**6. ఖండ కావ్యాలు / ఖండికలు :**

జాషువా - బుద్ధుడు
జంధ్యాల పాపయ్య శాస్త్రి - ఉదయశ్రీ
వేలూరు వారు - కథలు, గాథలు
వేదులవారు - చరణధూళి
కొండూరి వారు - అమరావతి
నండూరి - బుద్ధుడు, నాగార్జునుడు

**7. ధర్మపదం :**

బుద్ధుని బోధనల్ని ఎందరో కవులు కావ్యాలుగా రాశారు. రాజావాసిరెడ్డి, సదాశివేశ్వర ప్రసాద్ తెలుగులో తొలిధమ్మ పదం రచన. చర్ల గణపతిశాస్త్రి, బోధ చైతన్య, పెన్మత్స రాజంరాజు, గజ్జెల మల్లారెడ్డి ఇలా ఎందరో బుద్ధ ప్రబోధనల్నిధమ్మ పథం అనే పేర పద్య గద్య గేయ కావ్యాలుగా రాశారు.

**8. జాతక కథలు :**

బుద్ధుని గూర్చి ఎన్నో జాతక కథలు వున్నాయి. ఎందరో రచయితలు, పద్యాత్మకంగా, గద్యాత్మకంగా, గేయాత్మకంగా, ప్రబంధ ధోరణిలో, ఖండ కావ్య శ్రేణిలో బౌద్ధం ప్రస్ఫుటమైనట్లు రసవంతంగా రాశారు.

**9. శతకాలు :**

కోగంటి నరసింహరావు బుద్ధోపదేశం, బోధి భాస్కరుడు బుద్ధ శతకం, కొండవీటి వెంకట కవి త్రిశతి శతకాల్లో ముఖ్యమైనవి.

**10. బుర్రకథలు :**

నిమ్మరాజు చినవెంకటేశ్వర్లు శ్రీ బుద్ధ చరిత్రం, వెంకట్రాది అశోక ధర్మచక్రం, మొదలైనవి చెప్పుకోదగ్గవి.

**11. సిద్ధాంత గ్రంథం :**

రాయదుర్గం విజయలక్ష్మి 'తెలుగు కవిత్వంపై బౌద్ధం ప్రభావం' అంశంతో పరిశోధన గ్రంథం వెలువరించారు.

**బౌద్ధ ప్రభావం :**

బౌద్ధ ప్రభావం ఆనాటి సమాజంపై ఎంతగానో పడింది. అన్ని తరగతుల ప్రజల్ని ఆకట్టుకుంది. ప్రజలందరినీ కదలింపచేసి ఆలోచింపచేసింది. చారిత్రక పరిణామంలో బౌద్ధం, ఈ నవీన మానవ సంస్కృతిని ప్రచారం చేయడానికి అనల్పమైన శిల్పకళని, చిత్రలేఖనాన్ని జాతీయకళ సంపదగా ప్రోగుచేసింది.

మన జాతీయ చిహ్నామైన నాలుగు సింహాల శిల్పం, జాతీయ పతాకంలోని ధర్మ చక్రం, అశోకపు సారనాథ్‌లోని నిర్మించిన స్థంభం నుండే స్వీకరించబడ్డాయి. ధర్మ ప్రచారం కోసం అశోకుడు వేయించిన శాసనాలు ఒరిస్సా, ఆంధ్ర, కర్నాటక ప్రాంతాల్లో లెక్కకు మిక్కిలిగా వున్నాయి. మన రాష్ట్రంలో ఇప్పటికి బయల్పడిన సుమారు 300 బౌద్ధ క్షేత్రాల్లో అత్యధిక భాగం అశోకుని కాలం నాటివే. వీటిలో అమరావతి నుండి ఆదుర్రదాకా, సారనాథ్ నుండి నందలూరు దాకా అన్నీ దర్శనీయ స్థలాలే. ప్రతి క్షేత్రం, ప్రతి శాసనం అశోకుని బౌద్ధ సామ్రాజ్య విశిష్ఠతకు చెరగని అక్షర ప్రభలే.

బౌద్ధంలోని మానవతా దృక్పథం హిందూ మతంపై ప్రభావం చూపింది.

బౌద్ధంలోని అనేక విషయాల్ని హిందూమతం స్వీకరించింది.

బౌద్ధులు జంతు బలుల్ని ఖండించారు. జీవకారుణ్య భావం పెరిగింది.

బౌద్ధులు అనేక స్థూపాల్ని, ఆరామాల్ని, విద్యాలయాల్ని, ప్రయాణికుల విశ్రాంతి గృహాల్ని, వైద్యశాలల్ని ప్రజా సంక్షేమం కొరకు నిర్మించారు.

మానవులకే కాక పశువులకు కూడా విశ్రాంతి ఆవరణలు, పశు వైద్య శాలలు నిర్మించారు.

బౌద్ధ మత అవలంబకులైన రాజులు రోడ్లను నీటి పారుదల సౌకర్యాన్ని ఏర్పరిచారు.

నలంద, తక్షశిల, నాగార్జునకొండ లాంటి ప్రదేశాల్లో ప్రపంచ విఖ్యాత విశ్వ విద్యాలయాల్ని స్థాపించారు.

శాంతి, అహింస, సత్యం, సహజీవనం, ధర్మం, అనే ఐదు లక్షణాలు

# తెగుతున్న చిగురాకులు

శ్రీరంగనాయకి.వై
9441095974

మన లోపలి లోయలకు
ఒకటే ఆకలి
పలకరింపన్నా ఎవరో ఒకరు విసిరేయకపోతారా అని
మన లోపలి తుడిపివేతలకు
ఒకటే కోపం
చేదు ఎంతగా ఆలింగన చేసుకుంటున్నా
వెక్కుతావెందుకని ?
ఇతర్ల ప్రాపకం కోసమో
నిన్ను నువ్వు కోల్పోయే మాధుర్యం కోసమో
రెక్కలు విరిగిన కలల్ని వలసపోయిన ఆశల్ని
దగ్గరకు తీయలేక... దగ్గరకు తీయాల్సివచ్చి
ఒకటే గుంజాటన
యాచించుకుని పొందేది తెగిపడుతున్న తెల్లగవ్వల కన్నీరేనని
ఆనవాయితీ చూస్తూ కూడా
దేహం జోలెకట్టి అడుక్కుంటుందేం?
మనసు ముకుళితహస్తాలతో సాగిలపడుతుందేం ?
మమతలకోసం మనల్ని కోల్పోవటం సంతోషం
వాటి తెంపుదలకోసం ఏడుపుపాడె ఎక్కాల్సి రావడమే విషాదం



పట్టుమని పిడికెడు ఇష్టాన్ని
ప్రియంగా పిసరంత ప్రేమని
మోహనంగా దోసెడంత నిజాయితీని
కురిపించలేని వారికోసం
నిటారుగా నిలబడ్డ నువ్వెందుకు
తెంపుకుంటున్న చిగురాకులకు నెలవవుతావు?
స్నేహం, ప్రేమ
రెండు రెండక్షరాలే
యుగాలుగా... తరాలుగా
మనం ఇంకొకర్ని తోడుచేసుకుంటూ
మనం కోరిన మరొకర్ని కోల్పోతూ
కోర్కెల దిక్కు నుండి కదిలిన జాడల్లో
కనిపిస్తున్నాయి ఆనవాళ్ళు
అసువులు బాసిన అదృష్టాలు
వస్తా వట్టిదే ! పోతా వట్టిదే
అంతా
ఓటికుండ
కనబడ్డం, కనిపించకపోవడం మధ్యన
నిన్న ఉండేది
ఈ రోజు ఉంది
రేపు ఉంటుంది !!

---

మానవ జీవితాన్ని ప్రభావితం చేస్తాయని బౌద్ధం విశ్వసిస్తుంది.

బుద్ధుడు సిద్ధాంతాల ప్రభావం వల్లే నెహ్రూ, చౌఎన్‌లైలు పంచశీల సిద్ధాంతాన్ని ఆలీన దేశాల విదేశాంగ విధానపు పునాదిగా రూపొందిచారు.

గాంధీ అహింసా సిద్ధాంతం కూడా బుద్ధుని ప్రభావం అని వేరే చెప్పవలసిన పని లేదు.

మానవ సేవ కంటే గొప్పది ఏది కాదని బౌద్ధం భావించింది.

సారనాథ స్థూపంలోని అశోక స్థంభంలోని సింహాలు, ధర్మ చక్రం "సత్యమేవ జయతే" అనే వాక్యం భారతీయ చిహ్నాలుగా ప్రభుత్వంచే గుర్తించబడ్డాయి.

బౌద్ధం ప్రబోధించిన సత్యం, అహింసలు మన జాతీయోద్యంపై చెరగని ముద్రవేసి ప్రభావితం చేశాయి.

తెలుగులో పాళీ పదాలు అనేకం చేరాయి

బౌద్ధం నాటి వ్యవసాయ విధానవే మనం ఇప్పుడు అనుకరిస్తున్నాం.

మానవుల దుఃఖాన్ని తొలగించు మార్గాన్ని అన్వేషించి, ప్రజల్ని దుఃఖరహితులుగా చేయడానికి బుద్ధుడు తన ప్రథమ కర్తవ్యంగా భావించాడు.

బౌద్ధం సంఘంలో వర్ణ ప్రసక్తి లేకుండా ప్రతీ వారికి ప్రవేశం వుంది.

నైతిక జీవనానికి బౌద్ధం ఎక్కువగా ప్రాముఖ్యం ఇచ్చింది.

దళితుల అభ్యుదయం కోసం బౌద్ధమత సిద్ధాంతాలు అంబేద్కర్‌కి ఒక సాధనంగా ఉపయోగపడ్డాయి.

మానవుడు తన చర్యల వల్ల కలిగే ఫలితాల్ని తానే బాధ్యుడు అని చెప్పాడు. ఇక్కడ కర్మ సిద్ధాంతం లేదు.

మానవుని ప్రస్తుత స్థితికి అతని భూత కాల చర్యల ఫలితంగా భవిష్యత్ ప్రస్తుత చర్యలు ఆధారపడి వుంటాయని చెప్పడం వల్ల అతీంద్రియ శక్తుల ప్రమేయాన్ని బుద్ధుడు తొలగించాడు. ప్రతి విషయాన్ని కార్యకారణ సంబంధంగా వివరించాడు.

ఆత్మను, సృష్టికర్తగా పేర్కొనే దేవుడిని బౌద్ధం అంగీకరించదు.

ప్రాణుల్ని హింసించకూడదని ఉపదేశిస్తుంది.

బుద్ధుడు మద్యపానం వద్దు అన్నాడు.

మానవులందరూ సమానులు. సమానత్వం, సోదరతత్వం బౌద్ధం ప్రతిపాదించింది.

మూఢ నమ్మకాల్ని బుద్ధుడు తీవ్రంగా ఖండించాడు.

సత్యం, అహింస ముఖ్యమైన సిద్ధాంతాలుగా యజ్ఞయాగాది క్రతువుల్ని నిరసించింది. ప్రజావళికి ఆచరణ యోగ్యమైన మోక్ష మార్గాన్ని సూచించింది బౌద్ధం.

ఇలా తెలుగు సంస్కృతిపై బౌద్ధ ప్రభావం చాలా స్పష్టంగా కన్పిస్తుంది. తప్పుడు దారిలో నడుస్తున్న సంస్కృతి విధానాన్ని సరైన దారికి తీసుకొని వెళ్ళాలి. ఎన్ని కష్టాలు, నష్టాలు, ఎదురైనా ప్రతి తెలుగువాడు సంస్కృతి కోసం, జాతి క్షేమం కోసం, శ్రేయస్సు కోసం, శ్రమించక తప్పదు. తెలుగు చరిత్ర దేదీప్యమానంగా కొనసాగాలంటే తెలుగు సంస్కృతి స్థిరంగా వుండాలి. తెలుగు సంస్కృతి పరిరక్షణ కోసం ఏ త్యాగానికైనా మనం సిద్ధంగా వుండాలి.

రచయిత సెల్ : 9440641617

# సముద్రంతో ఆటలాడే కుర్రాడు

- రెడ్డి రామకృష్ణ
సెల్ : 9440175465

సముద్రంతో ఆటలాడే కుర్రాడ్ని చూశాను
నిన్న చింతపల్లిలో
సింహం జూలు పట్టి
దానిపై స్వారీ చేయాలని చూస్తున్నాడు
దెబ్బతిన్న పాములా సర్రున పైకి లేచిన కెరటం
బుసకొడుతూ పడగ విప్పితే
దాని పీక పట్టి
కోరలు పీకిన వానిలా
నిర్భయంగా దాని చుట్టే తిరుగుతున్నాడు
పన్నెండేళ్ళ బాల్యమే అయినా
తన గుండెల కింద కట్టపెట్టుకొని
సముద్రాన్ని జయించాలని చూస్తున్నాడు



ఒంటిపై చొక్కా కూడా లేనివాడు
బెల్లం దిమ్మకు పట్టిన కండచీమలా
సముద్రాన్ని అంటిపెట్టుకుని వుంటున్నాడు
ఎన్నిసార్లు విదిలించినా
మళ్ళీ మళ్ళీ వచ్చే చీమలా
కెరటం ఎన్నిమార్లు బయటికి నెట్టేస్తున్నా
ప్రతిసారి సముద్రంపైకి దూకుతూనే ఉన్నాడు
ఎంత సాహసం వాడిది
సాహసవంతులే దేన్నైనా సాధించగలరని
నిరూపించే వాడిలా ఉన్నాడు
రేపటి బతుకు సముద్రాన్ని ఈదటానికి
తనకు తనే తర్ఫీదు పొందుతున్న
మరో ఏకలవ్యుడిలా కనిపిస్తున్నాడు
ఈసారి బొటనవేలడిగే దొరలు వస్తే
తెడ్డు తిప్పగల చైతన్యాన్ని శ్వాసిస్తున్నట్టుగా ఉన్నాడు

---

# థామస్ మోర్

హిందీ మూలం : రాజేష్ జోషి

నేను థామస్ మోర్ తలకాయను
నన్ను లండన్ బ్రిడ్జిపై వ్రేలాడదీశారు
అందరు చూడాలని
ఎవరి నిర్ధారణకు వారు రావాలని

ఒక దాని వెల్తురు ఇంకో దాని వెల్తురు చీలుస్తూ
నాపై దీపాలని అమర్చారు
క్రీస్తు తలపై ముళ్ళ కిరీటంలా
నాపై దేశద్రోహి అని అభియోగం
న్యాయం చేస్తున్నట్టు కనబడాలని
నాపై కేసు ప్రహసనం నడిపారు
ఉరిశిక్ష విధించారు
అయినా కసి తీరలేదు
అందుకే, తల నరికారు
లండన్ బ్రిడ్జిపై వ్రేలాడదీశారు.
రాజ్యహింసకు మరో ఆయుధం రూపొందించారు

నేను థామస్ మోర్ తలకాయను
నన్ను లండన్ బ్రిడ్జిపై వ్రేలాడదీశారు
మతానికి, రాజ్యానికి గల సంబంధాన్ని
వ్యతిరేకించొద్దని శాసించారు
నేను ఒప్పుకోలేదు
రాజుని మతసభ అధ్యక్షుడిగా



ఒప్పుకోమని కోరారు
నేను నిరాకరించాను

నేను థామస్ మోర్ తలకాయను
నన్ను లండన్ బ్రిడ్జిపై వ్రేలాడదీశారు
అందరు చూడాలని
ఎవరి నిర్ధారణకు వారు రావాలని

నా వేల వాదనలు
నచ్చ చెప్పలేక పోయినా
నా తెగిన తల ఎప్పటికైనా
చెప్పగల్గుతుందని ఆశించనా !

నేను థామస్ మోర్ తలకాయను
మతాన్ని, రాజ్యాన్నీ కలిపిన
బ్రిడ్జిపై వ్రేలాడుతున్నాను

*సర్ థామస్ మోర్ ఎన్నో రచనలు చేసాడు. అందులో 'యుటోపియా' ముఖ్యమైనది. ఇందులో అప్పటి సమాజంలో ఉన్న సామాజిక, రాజకీయ చెడులను విమర్శించాడు. కొంతమంది అభిప్రాయం ప్రకారం ఇది సోషలిజం అప్రత్యక్ష అభివ్యక్తి. ఆయన క్రైస్తవ మతస్తుడు. రాజు చర్చికి నాయకుడు కావటాన్ని ఆయన వ్యతిరేకించాడు. ఆ కారణంగా 1534లో ఆయనపై దేశద్రోహం అభియోగం మోపారు. ఇంగ్లాండ్ రాజుని క్రైస్తవ ప్రపంచానికి మతపరమైన అధ్యక్షుడిగా ఒప్పుకోటానికి ఆయన నిరాకరించాడు. థామస్ మోర్‌కు 1535లో ఉరిశిక్ష విధించి ఆ తరువాత ఆయన తలను నరికి ప్రజలు భయభ్రాంతులయ్యేలా దాన్ని లండన్ బ్రిడ్జిపై వేలాడదీశారు.*

తెలుగు : వేదుల రామకృష్ణ

కథ

# జీవన పోరాటం



- సడ్లపల్లె చిదంబర రెడ్డి
సెల్ : 9440073636

**మెయిన్‌రోడ్డు ఏదో రిపేరీలో వున్నట్లుంది. వాహనాలు నేను కాపురమున్న ఇంటి ముందుగా మళ్లించారు. హారన్ మోతలు ఇంజన్ శబ్దాలు, మనుష్యుల అరుపులు, పొగ, దుమ్ము కలగలిసిన మహా మాలిన్య దుమారాలు వీధి నంతా ఆక్రమించాయి. మేడ మీద పోర్టికోలో కూర్చొని గమనిస్తున్న నాకు సిమెంటుతో ఎగగట్టిన ఇరుకు కొండల మధ్య యుద్ధభేరీలు మోగిస్తూ ఒకర్నొకరు తోసుకుంటు మహాసంగ్రామానికి బయలుదేరిన యుద్ధపటాలంలా తోచింది. చలికాలంలో కూడా ఊపిరందక ఉక్క పోసినట్లయింది. అంతలో ఎవరో ఫోన్ చేశారంటే లోపలికెళ్లాను.**

ఫోన్లో రాయుడు. నా చిరకాల మిత్రుడు "నిరసన మానేసి మొదట టి.వి. చూడు" అని ఆజ్ఞాపిస్తున్నట్లు చెప్పి టకీమని క్రెడిల్ చేశాడు. ఎందుకు? ఏమిటి? అనే అవకాశాన్నే నాకు కలిగించలేదు.

రాయుడు నేను చాలా ఏళ్లు ఒకే ఆఫీసులో పనిచేశాము పక్క పక్క వాటాల్లోనే అద్దెకు కూడా వున్నాము. కొత్తగా టీ.వి కార్యక్రమాలు వచ్చేటప్పుడు దీపప్పురుగుల్లా వాటికి అతుక్కుపోయే వారం. వయస్సుతో పాటు వచ్చిన మార్పోలేక కార్యక్రమాలు రూపొందించే వారి కక్కుర్తి, దిగజారుడు తనమో చెప్పలేను కాని అవి చూస్తునే అసహ్యం జుగుప్స, అలర్జీ వంటి జాడ్యాలు ఆవహించి దాదాపు దశాబ్దం నుండి కన్నెత్తి కూడా చూడకుండ భీష్మించుకున్నాము. జంతువులు, పక్షుల వంటి ప్రకృతి సంబంధించిన చానళ్లను చూద్దామంటే మత్తు మందు మాదకద్రవ్యాలకు అలవాటు పడిన వారికి లాగా ధారావాహికలు, సినీ మసాలాలు చూడ్డానికే జీవించినట్లున్న ఇతర కుటుంబ సభ్యులతో పోటీ పడలేక గతస్మృతులు నెమరు వేస్తూ పుస్తకాల పురుగులై కాలం వెళ్లదీస్తున్నాము.

అటువంటి రాయుడు నన్ను టీ.వీ చూడమన్నాడంటే ఏదో ప్రత్యేకత ఉంటుందనుకొని హాల్లో కొచ్చాను. క్రికెట్ చూడాలని ఒకరు, సినిమా చూడాలని ఒకరు పోట్లాడుకొంటున్న మనవడు మనవరాలు ఏ మూడ్‌లో వున్నారో కాని రిమోట్ నా చేతికిచ్చి బయటికి పరుగులు తీశారు. అప్పుడు సమయం మధ్యాహ్నం దాదాపు రెండు గంటలు కావచ్చు మీటనొక్కుతూనే న్యూస్ చానెల్‌లో ప్రకృతి విలయ తాండవం చేస్తోంది!

ఎన్నో ఏళ్లు అడవిలో స్వేచ్ఛగా జీవించిన సింహాన్ని బంధించి బోనులో వేస్తే బోను తలుపులు బద్దలయ్యేటట్లు పంజాతో బాదేస్తూ చెవులు చిల్లులు పడేలా గర్జిస్తూ మిడిసి పడినట్లు సముద్రం మహా ప్రళయతాండవం చేస్తోంది.

చెరువులు పొంగితే చేర్చుకోవడానికి ప్రాజెక్టులున్నాయి. ప్రాజెక్టులు కుంగితే భరించడానికి సముద్రాలున్నాయి. మరి సముద్రాలే ఉరికితే ఆపడానికి ఎవరున్నారో? ఎవరికి ఎవరు చెప్పుకోవాలో తెలియని స్థితి.

సరిహద్దు విషయమై పేచీ వచ్చి భూమీ సముద్రమూ పోట్లాడినట్లుంది. మట్టి ఆకృతిని మార్చి మిద్దెలుగా, మేడలుగా, చెట్లు చేమలుగా, రోడ్లు వాహనాలుగా, మనుషులుగా తనచుట్టు పచ్చని జీవితాలుగా అల్లుకుపోవడం సముద్రానికి ఇష్టంలేనట్లుంది. కొండంత అలలను తొండాల్లా చాపి అందినంత మేర ఈడ్చుకుపోయి అదే వేగంతో తన సరిహద్దు అవతలికి విసరి విసరి పారేస్తోంది. మనిషీ, యంత్రమూ, వస్తువూ సమస్తమూ సునామీ అలల రాక్షస కోరల్లో చిక్కి మన్నుగా మారిపోతోంది.

గాజు తెర మీద చూస్తేనే ఒళ్ళు కంపించేలా భయంకర దృశ్యాలు. జీవితమంటే ఏమిటనే నైరాశ్యం నన్ను నేను మరచి నాలో నేను తర్కించుకొంటు వేదాంత ధోరణికి మారే సరికి విద్యుత్ అంతరాయంతో కరాళ మృత్యు దృశ్యప్రవాహం ఆగిపోయింది.

నేను ఈలోకానికి వచ్చినా నా ఆలోచనల అలజడి తగ్గనే లేదు. ముప్పై ఏళ్లనాటి అనుభవం మదిలో మెదలసాగింది.

మాది రాయలసీమలో వ్యవసాయ కుటుంబం. అంతకు ముందు ముందు తరాల వారు నీటి జాడ వెదుక్కొంటు బ్రతుకు తెరువు మలుచుకొంటు ఎన్ని ఊళ్లు తిరిగారో తెలియదుగాని నాకు పదేళ్ల నుండి ఇరవయ్యేళ్ల వయస్సు వచ్చేసరికి జిల్లాను, రాష్ట్రాన్ని అన్ని వదిలి నాలుగైదు ప్రాంతాలు వలస పక్షుల్లా తిరగవలసి వచ్చింది. ఎంత సుభిక్షంగా ఉందని వెళ్లినా రెండేళ్లలో భరించరాని కరువు చుట్టుముట్టేది. మేత లేక పశువులు, రాత్రీ పగలూ పని చేసినా కడుపు నిండక మా కుటుంబము అలమటించిన సంఘటనలు గుర్తుకు వస్తే మనస్సు ఇప్పటికీ చలించిపోతుంది.



వ్యవసాయ పరంగా మా కుటుంబానికి చివరి మజిలీ కొత్త పల్లె. కర్ణాటకలోని అయిదారు చెరువులు నిండుతూ చివరగా హిందూపురం దగ్గర చెరువులో వాగులా చేరే చోటు అది. గతంలో ఆ వాగు జీవనదిలా ఉండిన ఆన వాళ్లుండేవి. ఆ వాగు మేము కొన్న భూమిని మూడు వైపులా అగడ్తలా ఆక్రమించి పంటకు రక్షణ కవచంలా ఉండేది.

నిజం చెప్పాలంటే ఆ వాగు చెరువులో చేరే చోట ద్వీపకల్పం వంటి ప్రాంతాన్ని నీరు నిలువకుండ మట్టి పేర్చి ఎత్తుచేసి వ్యవసాయానికి అనుకూలంగా మార్చారు. పుష్కలమైన నీరు పొలం మధ్య పాకవేసి అక్కడే కాపురమున్నాము.

రెండు సంవత్సరాలు తృప్తిగా పంట తీశామో లేదో మూడేళ్లు వరుస కరువు ముంచుకు వచ్చింది. బయట పైసా కూడా అప్పు పుట్టని పరిస్థితి. రాత్రీ పగలూ శ్రమ చేసినా ఫలిత ముండని కంచిగరుడసేవ వంటి వ్యవసాయం మా కుటుంబాన్ని కుదిపివేసింది.

"మన దగ్గర కూలిపని చేసేవారు రోజుకు నమ్మకంగా పదిరూపాయలు సంపాదిస్తున్నారు. ఎంతగా ఒళ్లు హూనం చేసుకొన్నా కాళ్లకు చెప్పులు, కడుపుకు మెతుకులు గతిలేని రైతు బతుకు మాకక్కర లేదు" అని వ్యవసాయాన్ని కాదని కట్టు గుడ్డలతో అన్నలు తమ్ములు పట్నానికి వెళ్లిపోయారు. ఆరోగ్యం సహకరించక నేను మాత్రం వ్యవసాయం ఊబిలోనే ఉండవలసి వచ్చింది.

పచ్చని తివాచీలా పరుచుకొన్న పంట పొలాలు కళ్ల ముందే బీళ్లుగా మారిపోయాయి. తీరిక లేని పనులతో రాత్రీ పగలూ చేలల్లో బిలబిలమని కనిపించే జనం కలికానికి కూడా కనిపించకుండా అయ్యారు. గడ్డి భూముల్లో నేల ఈనినట్లు కనిపించే పశువుల మందలు కబేళాలకు తరలిపోయాయి. వేలకొద్దీ ఎకరాల వెదురు పొదల వంటి చెరకును నమ్ముకొని కట్టిన చక్కెర కర్మాగారాలు రెండూ తమ సామర్థ్యాన్ని నిరూపించుకో కుండానే మూతపడిపోయాయి. తీపి కలలుగన్న కార్మికుల జీవితాలనూ భయంకరమైన కరువు చేదు అనుభవాల చీకటిని నింపింది.

పొలాలలోకి అలా తొంగి చూస్తే స్మశానాన్ని చూస్తున్నప్పటి వైరాగ్యం. కాళ్లకు పారాణి ఆరకుండా కళ్యాణమంటపంలోనే కాలిపోయిన నవ వధూవరుల శవాలను చూస్తున్నంత నిర్వేదం. ఎండిన గడ్డి పరకలు ఏరుకొస్తూ పాలిచ్చే పశువులను పోషిస్తూ అవి ఇచ్చే చేరెడు పాలను అమ్ముకొని బతకడవే చాలా మందికి జీవనాధారమైంది.

అటువంటి రోజుల్లో సాయంత్రం నాలుగ్గంటలకు చిన్న తుంపర మొదలైంది. చాలాకాలం తరువాత పడుతున్న చినుకులను చూస్తూ ఆనందంతో తడిసి పులకించిన నేలపువ్వు విరజిమ్ముతున్న కమ్మని మట్టివాసన అనుభవిస్తూ అమ్మా నాన్నా నేనూ చాలా సేపు మైమరచిపోయాము.

అపురూపంగా కురుస్తున్న వర్షాన్ని చూస్తూనే ఆకలి కూడా హరించుకు పోయినట్లయితే ఉదయం మిగిలిన చద్దినే యింత తిని ఎప్పుడు నిద్రపోయామో మాకే తెలియదు.

ఉన్నట్లుండి ఎద్దులు బెదిరిన శబ్దానికి మెలకువ వచ్చింది దీపం వెలిగిస్తే ఇంకే ముంది తలుపు సందుల్లో నుండి నీళ్లు ఇంట్లో కొస్తున్నాయి. నా కళ్లను నేనే నమ్మలేకపోయాను.

అంతలో తలుపులు తీసి బయటి కెళ్లిన నాన్న "ఒరే వరద ముంచుకొచ్చింది ఇల్లుపడిపోతుంది ఎద్దులు బయటికి వదలరా" అని అరిచాడు. క్షణంలో తాళ్లు విప్పి బయటికి తరుముకొచ్చాను. ఉరుములు మెరుపులతో ఆకాశం నుండి ధారల్లా పడుతోంది వాన. వంకలు వాగులు, పొలాలు గట్లు ఏకమై భయంకరమైన శబ్దం చేస్తూ ప్రవాహం ఏ దిక్కు నుండి ఏ దిక్కుకు వెళుతోందో అర్థం కాలేదు. సుడులు తిరుగుతూ కనిపించిన ఖాళీ ప్రదేశాన్నంతా ఆక్రమిస్తోంది. పాక చుట్టూ కట్టిన మట్టి గోడలు తడిసి నీటిలో కలిసి పోతున్నాయి. ఏ మాత్రం ఆలోచించడానికి ఆలస్యం చేయడానికి సమయం లేదు. నాన్న హడావుడిగా ఏదేదో చెబుతున్నాడు. అమ్మకు నాకు కాళ్లూ చేతులు ఆడలేదు. గంటు మూటలు కట్టి చేతికందిన వన్నీ తీసి బండికి కుక్కే సరికి తడిసి

## విషపు కోరలు

- శాంతిశ్రీ
9866371283

పంటపొలాల్లో.. పరిశ్రమల్లో..
విద్యాలయాల్లో... వైద్యాలయాల్లో..
ఒక్కటేమిటి..ఎక్కడ వీలైతే అక్కడ
ఎగబడి.. తెగబడి..
విషపుకోరలు చాచుకుంటూ
'ప్రపంచీకరణ ఫ్లూ' ప్రబలిపోయింది
కార్పొరేట్ ప్రభుత్వాల్ని పెనవేసుకున్న
దాని వికృత.. విషపు లక్షణాలతో
విశ్వం మొత్తం కకావికలం



సైబర్ నేరాలు.. అవినీతి దందాలు
జైళ్ల నిండా జగన్నాటక సూత్ర ధారులు
ఆకాశంతో పోటీపడే మార్ట్ల మాల్స్‌లో
చిరుద్యోగులుగా మారిన చిన్న వ్యాపారులు
విత్తని విత్తనాల కోసం క్యూలు
విసిగి వేసారి పట్టణాల్లో
ఎటిఎంల ముందు వాచ్‌మెన్‌లైన రైతులు
అవసరంలేకున్నా అణువణువు 'అణు'ప్లాంట్‌లు
షాక్‌లు కొడుతున్న విద్యుత్ బిల్లులు
భూమంతా బాధితుల రక్తంతో తడుస్తుంటే
తిరుగుబాటు ఆయుధాలు చిగురించి
విప్లవాల సేద్యంతో ఎర్రపూలు వికసిస్తాయి

---

ముద్దయిపోయాము. ఇంటి ఆవరణం లోనికే రెండడుగుల నీరు వస్తే బయటి పరిస్థితి ఊహించడానికే భయం వేసింది.

అమ్మా నాన్న వణికిపోతూ తల మీద గోనె సంచులు బోర్లించు కొని బండి ఎక్కేశారు. ఆకాశంలో మెరిసినప్పుడు తప్ప ఏమీ కనిపించని కటిక చీకటి. ఎలాగో తంటాలు పడి బండికి ఎద్దులు కట్టాను కనిపించని దారిలో ఏ వైపుగా బండి తోలాలో చెప్పమని నాన్ననడిగాను. "ఈ అర్ధరాత్రిలో ఏ చెరువు తెగిందో, ఏ ప్రళయం ముంచు కొచ్చిందో మనకు తెలీదు. పశువుల మీద భారం వేసి పగ్గాలు పట్టుకొని కూర్చో. అవి మాటలు రాని మూగ జీవాలే కావచ్చు కాని రెండేళ్ళుగా మన ఇంటి నుండి అన్ని దారుల్లోనూ బండిని లాగిన అపారమైన అనుభవం వాటికుంది. ప్రాణాల మీద మనకెంత తీపి ఉందో వాటికీ అంతే వుంటుంది. ఏదో ఒక విధంగా ఒడ్డుకు చేరుస్తాయి. ఒకవేళ గుంతలు మిట్టలు ఎక్కి, నీటి ఒత్తిడి పెరిగి బండి బోల్తా పడినా ఆరుపదులు దాటిన మాకోసం అంగలార్చ వద్దు ఎద్దుల పగ్గాలు వదలకుండా పట్టుకొని ప్రాణాలు కాపాడుకో ఆయుష్షు గట్టిగా వుంటే ఏ చెట్టో పుట్టో ఆధారమై మమ్ము రక్షిస్తుంది." అని విషయ బోధన చేస్తున్నాడు.



అమ్మ మాత్రం అందర్నీ గుర్తుకు తెచ్చుకొని పేరు పేరునా తలుచుకొని వారిని చూస్తానో లేదో అని వెక్కి వెక్కి ఏడుస్తూ వుంది. స్ఫురణకు వచ్చిన ప్రతి దేవున్నీ ప్రార్థిస్తూ కాపాడమని మొక్కు బడులు ప్రకటిస్తూ వుంది. కనుపాపల్లా పెంచిన కోళ్లు పిల్లి కుక్కలు ఏమయ్యాయో, ఎలా బతుకుతాయో అని అంగలారుస్తూ వుంది. నాన్న ఏమాత్రం తొణకడం లేదు. "పిచ్చిదానా ఈ ప్రపంచంలో ఎవరూ, ఏదీ శాశ్వతం కాదు. మట్టి నుండి పుట్టాము మట్టిలో కలవడానికి సిద్ధంగా వుండాలి. ఏడిస్తే, భయపడితే ఉన్న ఆరోగ్యం చెడుతుంది గాని మృత్యువు నుండి మాత్రం తప్పించుకోలేము. నిన్నటి దాకా నీరు కావాలని యమ యాతన పడ్డాము. ఇప్పుడు ఆ నీటిని చూసే భయపడి చస్తున్నాము. ఇది మనిషి పిచ్చి ఆలోచనే కాని మనో నిబ్బరం కాదు. ప్రకృతి దేనికి లొంగదు. కానున్నది కాక మానదు. మానవ ప్రయత్నాన్ని మాత్రం కడదాకా మరువకూడదు." అని వేదాంతాన్ని, కర్తవ్యాన్ని నూరిపోస్తున్నాడు. ఏమౌతుందో, ఎక్కడ నీటి పాలవుతామో అని భయపడుతున్న నాకు నాన్న మాటలు కొండంత ధైర్యాన్నిచ్చాయి. కళ్లు చించుకొన్నా కనిపించక చినుకులు రాళ్ల వర్షంలా మీద పడుతున్నా చెవులు చిల్లులు పడేలా ఉరుముతున్నా, నిండా మునిగిన వారికి చలిగాని, గాలి గాని లేదన్నట్లు ఏమాత్రం చలించకుండ యంత్రంలా నొగల మీద కూర్చుండి పోయాను.

నీటిలో బండి కుంభాల దాకా మునుగుతున్నా చెట్లు చేమలు తగులుకొన్నా లెక్క చేయకుండా ఎద్దులు సివంగుల్లా బుసలు కొడుతూ, తోక లెత్తుకొని జింకల్లా సాగిపోతున్నాయి. దాదాపు గంట ప్రయాణం తరువాత మా పొలాలకు తూర్పు వైపు ఎత్తు ప్రదేశం చేరింది బండి. అట్లాగే సద్దపల్లె వైపు బండిని సాగించమన్నాడు నాన్న. తొమ్మిది కిలోమీటర్లు ప్రయాణం చేసి అక్కడికి చేరేసరికి తెల్లారింది. వాన కూడా తగ్గింది.

ఆ అనుభవంతో నాన్న మనస్సు పూర్తిగా మారిపోయింది. పదైదు రోజుల్లో పొలాలన్నీ అమ్మి పారేసి మమ్ము వేరే బతుకు దారి వెదుక్కోమన్నాడు.

అప్పటి నుండి హోరున వర్షం వచ్చినా, నీటి బీభత్సాలు చూసినా మనోఫలకంపై గతం స్ఫురణకు వస్తూనే వుంటుంది.

అంతలో కరెంటు వచ్చింది. సునామీ ప్రళయ ప్రవాహాన్ని తెర మీదికి తెచ్చింది. మేడల్లోను మిద్దెల్లోను జనం వాటి మీద జలం. పరుగులు ఆర్తనాదాలు, అయినవారి కోసం గాలింపులు, కొన ఊపిరితో ఉన్న వారిని రక్షించే ప్రయత్నాలు.

భాష ప్రాంతం మతం ఖండాల కతీతంగా సానుభూతులు సహాయ సహకారాలు ఇదంతా చూస్తుంటే విశ్రాంత రాళంలో గ్రహాలకు, విశ్వ మానవ కుటుంబానికీ ఆరాటంలో తేడాలుండవచ్చు నేమో కాని, జీవనపోరాటం మాత్రం నిరంతర నిత్య సత్యమనిపించింది.

*(రచనాకాలం డిసెంబర్ 2004. ఆకాశవాణి కడప కేంద్రం జనవరి 2005)*



'మైలా ఆంచల్' నవలా రచయిత
ఫణీశ్వరనాథ్ రేణు

# "మైలా ఆంచల్" లోని సామాజిక జీవనం

- డా॥ జి. వి. రత్నాకర్

**మైలా ఆంచల్ నవలలోని మేరీగంజ్ గ్రామం నాటి గ్రామాల యొక్క సామాజిక, రాజకీయ సమస్యల్ని ప్రతిబింబింప జేస్తుంది. గ్రామీణుల ఆచార వ్యవహారాలు. సాంప్రదాయాలు జీవన పరిస్థితులు సమాజం మరియు దేశం యొక్క సమకాలీన సమస్యల్ని రేణు మైలా ఆంచల్ నవలలో విస్తృతంగా చర్చించటం జరిగింది ఇందులో ప్రతిపాదించిన విషయం కథావస్తువు యొక్క విశాలత్వం. కళాత్మకతల పరంగా చూస్తే ఈ నవల విశిష్టమైనది.**

స్వాతంత్ర్యానంతర కాలంలో గ్రామ జీవితాన్ని చిత్రించిన నవలాకారులలో ఫణీశ్వరనాథ్ రేణుకి విశిష్టమైన స్థానం ఉంది. ప్రేమ్‌చంద్ రాసిన గోదాన్ నవలలోని బెలారి గ్రామంలాగే మైలా ఆంచల్ నవలలోని మేరీగంజ్ గ్రామం నాటి గ్రామాల యొక్క సామాజిక, రాజకీయ సమస్యల్ని ప్రతిబింబింప జేస్తుంది. గ్రామీణుల ఆచార వ్యవహారాలు. సాంప్రదాయాలు జీవన పరిస్థితులు సమాజం మరియు దేశం యొక్క సమకాలీన సమస్యల్ని రేణు మైలా ఆంచల్ నవలలో విస్తృతంగా చర్చించటం జరిగింది ఇందులో ప్రతిపాదించిన విషయం కథావస్తువు విశాలత్వం. కళాత్మకతల పరంగా చూస్తే ఈ నవల విశిష్టమైనది. స్వాతంత్ర్యం లభించిన తర్వాత కాలపు సామాజిక రాజకీయ జీవితాల నికృష్ట పరిస్థితులు వాస్తవిక రూపంతో ఈ నవలలో మన ముందుకి వస్తాయి. పాఠకుల్ని నిలదీసి ప్రశ్నిస్తాయి.

మేరీగంజ్ గ్రామం బీహార్ రాష్ట్రంలోని పూర్ణియా జిల్లాలో ఒక పెద్ద గ్రామం. రోతహట్ రైల్వేస్టేషన్‌కి పద్నాలుగు మైళ్ళ దూరంలో ఉంటుంది. మేరీగంజ్‌కి చుట్టు ప్రక్కలా లక్షల ఎకరాల భూమి ఉంది. అందులో గడ్డి కూడా మొలవదు. ఆ గ్రామంలో పన్నెండు కులాలు ఉన్నాయి. అందులో రాజపుత్రులు, కాయస్థులు ముఖ్యమైన కులాల వారు. స్వాతంత్ర్యం లభించిన తర్వాత యాదవ కులం బలమైన వర్గంగా అభివృద్ధి చెందింది. మేరీ గంజ్ గ్రామం మొత్తం మీద పదిమంది మాత్రమే చదువుకొన్న వాళ్ళు దొరుకుతారు. బాల్‌దేవ్ ఆ వూరికి దగ్గర చన్నవ్ పట్టి గ్రామానికి చెందిన స్వాతంత్ర్య సమరయోధుడు. అతను ఖాదీ ధరిస్తాడు. జైహింద్ అంటూ ఉంటాడు. స్వాతంత్ర్యానంతరం కాంగ్రెసు నాయకుడవుతాడు. బావన్‌దాసు నిజమైన గాంధేయవాది. స్వతంత్ర భారతంలో మతతత్వం, కులతత్వం, పదవీ వ్యామోహం అవినీతి చూచి చాలా బాధపడతాడు. అతని దృష్టిలో భారతమాత ఇప్పుడు కూడా బందీయై ఏడుస్తూనే ఉంది.

మైలా ఆంచల్ నవల ఆరంభంలో రచయిత –
ఇందులో పూలు ఉన్నాయి ముల్లు కూడా ఉన్నాయి
ధుమ్ము, ధూళి కూడా ఉంది.
ఇందులో సుగంధం ఉంది. బురద కూడా ఉంది
ఇందులో మంచి గంధం సౌందర్యం ఉన్నాయి.
కురూపితనం కూడా ఉంది." అంటాడు.

ఈ నవలలోని ముఖ్యమైన పాత్రలన్నీ బురదలో ఉండి కూడా బయటకు వచ్చే ప్రయత్నం చేస్తాయి మైలా ఆంచల్ అనుపేరు నవలకు అన్ని విధాలా సరియైనది. మైలా ఆంచల్ అంటే భారతదేశంలోని మలినమైన ప్రాంతం అని అర్థం. నేడు భారతమాత కొంగు మలినమైపోయిందని అంటాడు రచయిత. ఈ నవలలో బాల్ దేవ్, కాళీచరణ బావన్‌దాస్ మొదలైనవారు, ఆ గ్రామ రాజకీయ చైతన్యానికి ప్రతీకగా మన ముందుకి వస్తారు. ప్రజలను మేల్కొలుపుతూ జన చైతన్య వేకువ గీతాలను ఆలపించే క్రమం ఇందులో మనం చూస్తాము.

బూజు పట్టిన ఆలోచనలు. ఆచార సాంప్రదాయాలు మూఢ విశ్వాసాలను పారద్రోలుతూ కొత్తరక్తం వెలుగు, క్రాంతి ఎలా సమాజంలోకి ప్రవహిస్తాయో ఈ నవలలో చిత్రించటం జరిగింది. నవల ఆరంభ కాలంలో దేశంలో స్వాతంత్ర్య పోరాటం జరుగుతుంది. నగరాలలో వ్యాపించినంతగా గ్రామాల్లో పోరాట ప్రభావం కనబడదు. గ్రామీణ ప్రజలు తమ అవిద్య అమాయకత్వం కారణంగా స్వతంత్ర సంగ్రామము యొక్క విలువ తెలుసుకోలేకపోతారు. స్వాతంత్ర్య వేడుకల్ని జరుపుతూ ఊరేగింపు చేస్తున్న దృశ్యాన్ని ప్రజలు వింతగా చూస్తారు.

గ్రామ ప్రజలలో రాజకీయాల పట్ల అవగాహన కలిగేందుకు బాల్‌దేవ్, కాలీచరణ్, బావన్‌దాస్‌లు ఆరాటపడేవారు.

రేణు తన నవలలన్నింటిని వాస్తవిక దృష్టితో చిత్రించటం జరిగింది. మైలా ఆంచల్‌లో మిథిలా ప్రాంతంలో నిరంతరం మార్పులకు లోనవుతున్న నేటి గ్రామపు ఆత్మకథగా చెప్పవచ్చు శతాబ్దాల నిద్రనుండి, చీకటి రాత్రుల నుండి మేలుకొంటున్న గ్రామాల యొక్క సామాజిక, ఆర్థిక రాజకీయ సమస్యల చిత్రణ ఇందులో కనిపిస్తుంది. మైలా ఆంచల్ నవలలో ప్రధాన పాత్ర ఏదీ కనిపించదు. ఇందులోని కథా వస్తువు, వర్ణనాశైలి, సామాజిక వాతావరణం, అనేకమైన పాత్రలు వైవిధ్య భరితంగా కనిపిస్తాయి. నవలపేరు కూడా ఏదేని పాత్ర పరంగా కాక విశిష్టమైన ఒక ప్రదేశాన్ని బట్టి నిర్ణయించడం జరిగింది.

భారతదేశపు నేటి గ్రామీణ ప్రాంతం అజ్ఞానం, అంధ విశ్వాసాలు, మూఢ నమ్మకాలు. విషమ పరిస్థితుల కారణంగా ఉజ్వలమైన తన గత చరిత్రని కోల్పోయి మలినమయిపోయింది. మేరీగంజ్ గ్రామం ఇందులో ఒక పరిమిత ప్రాంతంగానే కాక భారతదేశం మొత్తంగా స్వరాజ్యం లభించిన తర్వాత పరిణామాలకు నిదర్శనమై సజీవ చిత్రంగా మన ముందుకు వస్తుంది. డా॥ ప్రశాంత్ మలేరియా సెంటర్‌కి ఇన్‌ఛార్జ్ డాక్టర్‌గా వస్తాడు. ఆ గ్రామ రాజకీయాలకు ఆందోళనలకు అతను బలౌతాడు. మేరీగంజ్ వలె భారతదేశంలోని ప్రతిగ్రామం లెక్కలేని రీతుల్లో ముక్కలుగా విడిపోయాయి.

మైలా ఆంచల్ నవలని ప్రాదేశిక నవల అని అనవచ్చు. ఇందులో రచయిత ఇతిహాసపు చీకటి కోణాల్ని నిర్భయంగా ఆవిష్కరిస్తాడు. చరిత్ర కెక్కని గ్రామీణ ప్రాంతాన్ని కథా నాయికని చేస్తాడు. హిందీలో ఈ నవలని ఆంచలిక నవల అంటారు. ఈ నవలలో గ్రామాల సభ్యత, సంస్కృతి. ఆచార వ్యవహారాలు, ఆహారపు అలవాట్లు, వేషధారణ, పండుగలు, ఆటపాటలు మూఢనమ్మకాలు సామెతలు మొదలగునవి వాస్తవికంగా ప్రతిబింబించబడతాయి.

**మైలా ఆంచల్ నవలని ప్రాదేశిక నవల అని అనవచ్చు. ఇందులో రచయిత ఇతిహాసపు చీకటి కోణాల్ని నిర్భయంగా ఆవిష్కరిస్తాడు. చరిత్ర కెక్కని గ్రామీణ ప్రాంతాన్ని కథా నాయికని చేస్తాడు. హిందీలో ఈ నవలని ఆంచలిక నవల అంటారు. ఈ నవలలో గ్రామాల సభ్యత, సంస్కృతి. ఆచార వ్యవహారాలు, ఆహారపు అలవాట్లు, వేషధారణ, పండుగలు, ఆటపాటలు మూఢనమ్మకాలు సామెతలు మొదలగునవి వాస్తవికంగా ప్రతిబింబించబడతాయి.**

ఎన్నికల్లోకి కులం, బంధుప్రీతి, కుల కుటిలత్వం, ప్రవేశించాయి. ముఠా రాజకీయాలు ఆరోగ్యకరమైన రాజకీయ క్షేత్రాన్ని కలుషితం చేశాయి. బలం కలిగినవాళ్ళు, ధనవంతులు ఎన్నికల్లో నిలిచే ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. డాక్టర్ రాంకరణ్ సాలే సంహ్ బలప్రయోగం ద్వారానైనా ఎన్నికల్లో గెలిచే యత్నాలు ప్రారంభిస్తాడు. కాళీచరణ్ వారి కుట్రలకు భగ్నం చేస్తాడు. ఇందులో జనసంఘ్, సోషలిస్టు, కమ్యూనిస్టు, కాంగ్రెసు పార్టీలన్నీ తమ ప్రచార పర్వాన్ని ఆరంభిస్తారు. అందరూ దళితుల సంక్షేమమే తమ ధ్యేయం అంటూ వాగ్దానాల వెల్లువను ప్రవహింపజేస్తారు. నల్లటోపీలు ధరించిన జన సంఘీయులు హిందూ రాజ్యస్థాపనే తమ ధ్యేయం అంటూ ఉంటారు. కమ్యూనిస్టు పార్టీకి చెందిన వాసుదేవ్ వాళ్ళను మూర్ఖులంటాడు. బాల్‌దేవ్ కాంగ్రెసు యొక్క మూడురంగుల జండాను ఎగరేస్తూ తిరుగుతూ ఉంటాడు. కలుషితమైన రాజకీయాల మధ్య డా॥ప్రశాంత్ నలిగిపోతూ పరిపూర్ణంగా సమాజ సేవ చేయలేకపోతాడు. వివిధ రాజకీయ పార్టీలు వారి సిద్ధాంతాలు. పార్టీల సమస్యలు వర్గవైషమ్యాలు ఈ నవలలో రేణు వివరిస్తాడు.

మైలా ఆంచల్ నవలలో నేటి గ్రామ ప్రాంతాలు కలుషిత రాజకీయాలతో ఎలా కుళ్ళిపోతున్నాయో సమగ్రంగా వివరిస్తాడు రచయిత. రాజకీయాల్లో లంచగొండితనం అహింసకు జన్మనిచ్చింది. నిజమైన దేశభక్తులు స్వాతంత్ర్యం కోసం ప్రాణాలర్పిస్తుంటే అవకాశవాదపు నాయకులు అహింసా ముసుగు ఉండి సామాన్య ప్రజానీకాన్ని దోపిడీచేస్తుంటారు. నగరాలలో వలె నేడు పల్లెల్లో కూడా రాజకీయ లంచగొండి తనం వ్యాపించింది. మైలా ఆంచల్ నవలలో మనం సమాజంలో వ్యాపించి ఉన్న మతపరమైన వికృత చేష్టలను విస్తృతంగా చూడగలము. మతమౌఢ్యపు మూఢాచారాలు, అంధవిశ్వాసాలు వెర్రితలలు వేస్తున్న విపరీత విన్యాసాలు సమాజాన్ని అడుగడుగునా ఎలా దగా చేస్తున్నాయో ఇందులో స్పష్టంగా చూడగలము.

జ్యోతిష్యులు, భూతవైద్యులు సంస్కరణలను క్రొత్త క్రొత్త మార్పులను వ్యతిరేకిస్తారు. మేరీగంజ్ గ్రామంలో ఆసుపత్రి ప్రారంభించిన తర్వాత వీరు ఇంగ్లీషు మందులు వాడితే శరీరమంతా విషమై పోతుంది అంటూ ప్రజలను భయపెడతారు. గ్రామాల్లో మూఢ నమ్మకాల కారణంగా వితంతు స్త్రీలను దయ్యాలుగా భావిస్తారు. మేరీగంజ్ గ్రామంలో ఒక వ్యక్తి, ముసలి వితంతు స్త్రీని దయ్యంగా భావించి చంపివేస్తాడు. ప్రజలు నిజమే ఆమె దయ్యం గనుక చంపబడ్డది అని ఆలోచిస్తారు. జ్యోతిష్యుని నాల్గవ భార్యకు జబ్బు చేస్తుంది. ఆసుపత్రి మందు వాడేందుకు అతను నిరాకరిస్తాడు. రోగం ముదిరి ఆమె చనిపోతుంది. గ్రామస్తులు విద్యావంతులయితే గ్రామాల్లో ఈ మూఢ నమ్మకాలు తొలగి పోతాయని రచయిత వివరిస్తాడు.

గ్రామాల్లో మఠాలు దేవాలయాలు పాప కార్యాలకు అవినీతి లంచగొండితనాలకి నిలయాలుగా మారాయి. మఠాల్లో సాధువులు, పూజారులు వారి శిష్యులు అవినీతిలో కూరుకుపోతున్నారు. పూజా కార్యక్రమాల ముసుగులో సాధువులు స్త్రీల శీలాన్ని దోచుకుంటున్నారు. సాధువులు గంజాయి లాంటి మాదక ద్రవ్యాలకు అలవాటు పడుతున్నారు. మైలా ఆంచల్ నవలలో మతపరమైన అవినీతి యొక్క నగ్నత మన ముందుంచుతాడు రచయిత. రేణు ఈ నవలలో మఠంలో ఉన్న లక్ష్మి వ్యక్తిత్వాన్ని ఉన్నతంగా చూపుతాడు.

మైలా ఆంచల్ నవలలో ఆర్థిక సమస్యలు మరియు దారిద్ర్యంల యొక్క నిజ స్వరూపాన్ని మన ముందుంచుతుంది. సమాజంలో ధనిక, పేదల నడుమ మరియు దోపిడీ దారుల, పీడితుల నడుమ నిరంతర పోరాటం జరుగుతూనే ఉంటుంది. ధనవంతులు పేదలను దోపిడీ చేస్తూ తమ సుఖాల్ని చూసుకుంటూనే ఉంటారు. పీడిత ప్రజలు

## అశ్రుధార

ఝాన్సీ కె.వి.కుమారి
9010823014

ఏ మహిళ చరిత్ర చూచినా
ఏముంది గర్వకారణం
కన్నీటి కడలిలోనే
అనంత జీవన యానం

అవమానాల అగ్నిజ్వాలలలో
ఆశల మృత్యువుగానం
సంప్రదాయ సంకెళ్ళలో
కట్టు బానిసల పయనం
ఆక్రోశాల పల్లవులకు
ఆవేదనా స్వరాల రాగం
మేలిముసుగుల జాలులో
మూగచూపుల రోదనం
ఎందరు అంబేద్కరులు పుట్టినా
తుడువలేరు ఆమె అశ్రువాహిని
ఎందరు రామ్మోహన్‌రాయ్‌లు
ప్రభవించినా
ఆపలేరు ఆమె ప్రాణబలియాగాన్ని...
యముడు సైతం గౌరవిస్తాడు
ఆమె పాతివ్రత్య బలాన్ని
పతిమాత్రం పరిహసిస్తాడు



ఆమె మానవతా పవిత్రతను
"అంత రంగం పవిత్రమైతేనే
ఎంచవచ్చు పరులనేరం"

బ్రతుకులకు న్యాయమార్గం
అందుకున్న నాడే అశ్రుధారకు అంతం
అవనిలో శుభోదయం
అతివలకు ఆనందభానోదయం!!

**(భర్తల అనుమానాలకు బలవుతున్న భార్యలు. వార్త 23.7.2012 చూసి)**

## గోస

సుందర్
9666883818

మాపు మూడయితుంటది...
పట్నం పడుకోనుంటది...
సిమ్మసీకటి కమ్మేసుంటది...



సీపురుకట్టందుకుని...
ఆల్చమైంపోయిందనీ...
ఉరికురికొస్తుంటరూ...
గలీజైన రోడ్లన్నీ...
ఊకుతనే ఉంటరూ...
నడుములుపట్టంగా...
జబ్బలు గుంజంగా...
పారిశుధ్య కార్మికులు...
పొట్టకూటికోసమనీ...!!

ఐదింటికి నిద్రలేచి...
బెడ్డుకాఫీ లాగించి...
షూసులేసు కట్టుకునీ
సక్కగా పార్కుల్లో సుట్టూ...
తిరుగుతనే ఉంటరూ...
బలిసిన దొర, దొరసానులు...
సెమటలు పట్టాలనీ
పొట్టలు తగ్గాలనీ...

ఒకరి గోస తిండికై...
మరొకరు తిన్నదరిగేందుకు...

---

రేయింబగళ్ళు కష్టించి కూడా కడుపు నింపుకోను పిడికెడు మెతుకులు దొరకని దుర్భర పరిస్థితుల్ని. శరీరం కప్పుకోను చాలినంత గుడ్డ కూడా చిక్కని దారుణ దృశ్యాల్ని మన ముందుకు తెస్తాడు రచయిత.

చివరలో జమీందారు తన భూమిని పేదలకు పంచి గ్రామాలలో భూ సమస్యకు కొంత పరిష్కారం చూపుతాడు. సంఘాలు తమ హక్కుల కొరకు తిరుగుబాటు చేసే వైనాన్ని మన కళ్ళ ముందుంచుతాడు రచయిత.

గ్రామాల్లోని కులసమస్య గురించి రచయిత రేణు వివరంగా ఇందులో చర్చిస్తాడు. కొందరిని అధికులుగా, కొందరిని అధములుగా కులం ఎలా చూపుతున్నదో చిత్రిస్తాడు. మేరీగంజ్‌లో అనేక కులాల వారున్నారు. ఒక కులం మరొక కులాన్ని హీనంగా చూస్తుంది. రాజపుత్రులు, యాదవుల మధ్య ఉన్న కుల స్పర్థలు చివరికి శత్రుత్వ కారణమవుతాయి. బ్రాహ్మణులు తమ ప్రయోజనాల కోసం రాజపుత్రులు, యాదవుల మధ్య ద్వేషం రెచ్చగొడుతుంటారు. మేరీగంజ్ గ్రామం పూర్తిగా కుల కుట్రలతో పెద్ద, చిన్న తేడాలతో నిండి ఉంటుంది.

గ్రామాల్లోని అగ్రకులాల వారు అంటరాని స్త్రీలను బావుల నుండి నీళ్ళు తెచ్చుకునేందుకు అంగీకరించరు కానీ వారితో రాత్రులు గడిపేందుకు మాత్రం ముందుకు వస్తారు. ఇందులో సహదేవ్ మిసిల్ పులియా యవ్వనాన్ని దోచుకుంటాడు. కానీ ఆమె చేతి వంట తినేందుకు మాత్రం సంకోచిస్తాడు. రచయిత ఇందులో ప్రేమ వివాహం సమర్థిస్తాడు. కమల పెళ్ళి డా॥ ప్రశాంత్‌తో జరుపుతాడు.

మైలా ఆంచల్ నవలలో రచయిత కులతత్వం, మతతత్వం, అంటరానితనం, వ్యభిచారం, ముఠాల అవినీతి జమిందారు దోపిడీ ప్రతి చిన్న విషయానికి గొడవపడే గ్రామీణ ప్రాంతపు కలుషిత రాజకీయ దృశ్యాన్ని మనకు చూపుతాడు. డా॥ ప్రశాంత్ నేతృత్వంలో గ్రామ సమస్యలకు పరిష్కార మార్గాన్ని చూపే ప్రయత్నం చేస్తాడు రేణు డా॥ ప్రశాంత్ సంస్కర్తగా, సేవకునిగా సమాజ క్షేమం కోసం ప్రయత్నిస్తూ గ్రామ సమస్యలకు సమాధానంగా మన ముందుకు వస్తాడు. మైలా ఆంచల్ నవలలో ముఖ్య కథతో పాటు మమత కాళీచరణ్, పులియా సహదేవ్ మిశ్ర. కసుల ప్రశాంత్‌ల విషయాలు మన ముందుకు వస్తాయి.

మైలా ఆంచల్ నవల మేరీగంజ్ ప్రాంతాల్లోని మలినమయ గ్రామీణ ప్రాంతాల చరిత్ర. రచయిత మేరీగంజ్ ప్రాంతంలోని ప్రజల ఆచార వ్యవహారాలు, సంస్కృతి, అలవాట్లు, వాస్తవికత చిత్రీకరిస్తాడు. హిందీ నవలా సాహిత్యంలో మైలా ఆంచల్ గ్రామీణ జీవితాన్ని పరిపూర్ణంగా చిత్రించిన నవలలో మొదటి శ్రేణికి చెందినది. విషయ వైవిధ్యం, భిన్న జీవితాల చిత్రణ. సామాజిక విషయాలు సజీవత్వం భౌగోళిక ప్రాంతాల వర్ణన. అక్కడి విశ్వాసాలు ఆచార సంప్రదాయాలు. మొదలగు వాటిని సజీవంగా చిత్రించడంతో ఈ నవల అత్యంత పాఠకాదరణ పొందినది. రచయిత ఫణీశ్వరునాథ్ రేణు ఈ రచనా కార్యంలో సఫలీకృతుడైనాడు.

**రచయిత సెల్ : 9849303175**

# జనకవనమంటే

- కుమ్మరి భిక్షపతి
సెల్ : 9490508206



ఓరే తమ్ముడూ...
పనికి రాదని పారేసిన విత్తనం...
పుడమితల్లి అంతర్వాహిణి నుండి
అంకురమై... 'మొక్కై... మహావృక్షమై...'
సకల ప్రాణి కోటికి.. ప్రాణవాయువు అందించినట్టూ...
సర్వం కోల్పోయిన మనిషికి... 'ఆత్మీయ నేస్తం కవిత్వం!'
విశ్వబంధులాంటి మేఘం.. అమృతంలాంటి వర్షాన్నిచ్చినట్టు
విశ్వమానవాళికి... ఆత్మబంధువే... 'కవిత్వం!'
కుత్సిత మనుషులు... కూడుపెట్టని కవిత్వమెందుకని?
హేళన చేసే.. కవిత్వమే...
అదిగో.. కళ్ళుంటే చూడండి... చెవులుంటే వినండి...
కర్షక... కార్మిక హక్కుల కొరకూ...
'భూమి' కొరకు 'బువ్వ' కొరకు..
కదను తొక్కే... 'ప్రజా పోరాటాలకు'
'భూమిక'యై... కవిత్వమే ముందడుగై కదులుతుంది!

రైతన్న పెట్టిన 'మెతుకు సంతకాన్ని'
ప్రపంచ 'శ్రమశక్తి' ప్రతీకగా నిలిపేది కవిత్వం!
"దూదిపూల దుఃఖనదీ" వారసులకు... నేనున్నానని
భరోసానిస్తూ... 'రైతు పోరాట స్ఫూర్తి'యై జ్వలించేది కవిత్వం!
'రాలిన వరికంకుల'... భార్యాబిడ్డల కోసం...
బాధ్యత మరచిన "పాలకుల"పైనే
'అక్షర శరాలు' సంధించేదీ... కవిత్వమంటే!
'అమ్మ'లాంటి... 'అనురాగ పుష్పం' కవిత్వమంటే...!
'నాన్న'లాంటి 'ప్రేమ పరిమళం'... "జనకవనమంటే!!"

# ఆ తెరలూ, ఆ అలలూ



- ఎరుకలపూడి గోపీనాథరావు
సెల్ : 9848293119

వారు తమ నైజపు నైపుణ్యంతో
శూన్యంలో కొన్ని అదృశ్య యవనికలను సుందరంగా సృష్టించి
కష్టజీవులందరినీ ఆ కపటపు తెరలపై
కాసుల భోషాణాలతో, షడ్రసోపేత భోజ్యాలతో భోగిస్తున్న
అభినవ భోజరాజుల్లా ఆవిష్కరింపజేస్తారు!
అలా కనికట్టుతో కార్యం సాధించగానే
వారూ, వారి తెరబొమ్మలూ మాయమౌతూ వుంటాయి!
అల్పజీవులకు అంతిమంగా కన్నీటి కష్టాలే ఎదురవుతూ వుంటాయి!

వారు అంతరంగంలో అవసరాన్ని బట్టి అక్కరకొచ్చే
అలలెన్నో సిద్ధంగా వుంచుకుంటూ
తగిన గారడీకి సరిపడ సాధనాలను క్రమబద్ధంగా ఎంచుకుంటారు
రంగస్థలాన్ని బట్టి వారి విద్యా ప్రదర్శన రంగుమారుతూ వుంటుంది
క్షుభితులూ, క్షుధితులూ పరుగులతో పడుతూ లేస్తూ
కొండంత కోరికతో నిండుగా తరలిరాగానే
వారి క్షుద్రవిద్యల కపట నాటకాలకు తెరలేస్తుంది
ఒక భయంకర సామూహిక వశీకరణకు జనులంతా తోడై
త్రికరణ శుద్ధిగా త్రిశంకు స్వర్గంలో విహరిస్తారు!
మాయమాసి, మత్తుచిత్తైగానే నేలపై పడి
కన్నదంతా డొల్ల అనీ, విన్నదంతా కల్ల అనీ తెలసి
ప్రేక్షకుల ప్రతి ఆశ ఒక అపాయమౌతూ వుంటుంది!
ప్రతి నమ్మకమూ ఒక అగాధ గాయమౌతూ వుంటుంది!
వారు - పాలనాధికారాలతో ప్రజలను
తమ చెప్పుచేతల చెఱలతో బంధిస్తూ
ప్రజాస్వామ్యాన్ని పరిహసిస్తూ ప్రభుత్వాన్ని దోచుకుంటుంటారు!
వారు - వారి వారి సంపదల సస్యశ్యామల క్షేత్రాలకు
వారి వారి వారి వారి బినామీలను వాటంగా కల్పిస్తుంటారు!
ఎగ్గులు తీర్చే ఏలికలను ఎన్నుకోదలచిన
ప్రతి ఓటూ అన్యాయమౌతూ వుంటుంది!
ప్రతి సాధారణ పౌరుని విషాదము
ఒక విషపేయమౌతూ వుంటుంది!
బాధితులందరూ ఒట్టుబెట్టుకొని, జట్టు కట్టుకొని -
ఆ తెరల పొరల బ్రతుకులన్నీ తెల్లవారిపోయేలా విప్లవించొద్దూ?
ఆ అలల దొంతరలూ, ఆ చెఱల ఒరలూ
గుల్లబారి పోయేలా, చెల్లాచెదురయ్యేలా విక్రమించొద్దూ?



'పోతన చరిత్రము' రచయిత
వానమామలై వరదాచార్యులు

# అపురూప దృశ్యకావ్యము పోతన చరిత్రము

- ఎల్. గాయత్రి

"ఒక మహాకవి జీవితచరితామృతమును మరొక మహాకవి కమ్మని కవితారసాయనమును కలిపి ఆంధ్రుల కందిచ్చి ఆనంద పారవశ్యమును కల్పించు నవ్య సువర్ణ పాత్రమీ పోతన చరిత్ర మహాకావ్యము" అని పోతన చరిత్రము తొలిపలుకులో ఆచార్య డా॥ దివాకర్ల వెంకటావధాని వివరించారు.

వానమామలై వరదాచార్యులు రచించిన పోతన చరిత్రము సాహితీ సమరాంగణంలో మహాకావ్యంగా నిలిచింది. ఈ మహాకవి శ్రీమతి సీతాంబ. బక్కయ్యశాస్త్రి దంపతుల సంతానంగా వరంగల్ జిల్లా మడికొండలో జన్మించి ఆదిలాబాద్ జిల్లా చెన్నూరులో మనుగడ సాగించారు. మణిమాల, జయధ్వజం, ఆహ్వానం, విపులబ్ధ. రైతుబిడ్డ వంటి రచనలే కాక పలు సాహిత్య ప్రక్రియలలో రచనలు కొనసాగించి కవి శిరోవతంస, మధురకవి, మహాకవి శిరోమణి, ఉత్రేపక్షా చక్రవర్తి, అభినవపోతన, అభినవ కాళిదాసు మొదలగు బిరుదులు పొంది ఖ్యాతి గడించారు.

పోతన చరిత్రముపై ఆచార్యుల వారి సమకాలికులు, సాహితీదిగ్గజాలు తమ అమూల్యమైన అభిప్రాయాలను ఈ విధంగా తెలియజేశారు.

"పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట" అనుభవ్యమైన ఆవేశముతో పోతన ఆంధ్ర మహాభాగవతమును పురాణించినాడు. ఇంచుమించుగా అంతటి ఆవేశముతోనే ఆచార్యులవారు పోతనచరిత్ర కావ్యరూపముగా రచించినాడు. ఆచార్యులవారు భాగవతోత్తముని కథను కావ్యవస్తువుగా స్వీకరించినారు, తెలుగు సాహిత్యములో సర్వవిధాల పోతనచెంత నిలువదగిన కవీశ్వరులు ఆచార్యులవారు, అని కావ్యమును గురించి తమ అభిప్రాయమును స్పష్టము చేశారు ఆనాటి రాష్ట్ర సాహిత్య అకాడమీ కార్యదర్శిగారైన దేవులపల్లి రామానుజరావు.

"తెలుగు భాష ఉన్నంతకాలం భాగవతం నిలుస్తుంది, పోతన చరిత్ర నిలుస్తుంది. అది త్రిలింగ ధాత్రికి రత్నదీపం ఇది తెలుంగు బాసకు నిజస్వరూపం" - డా॥ బి. రామరాజు అభిప్రాయపడ్డారు.

పోతన చరిత్రము చదివి రసానుభూతి చెందిన ప్రముఖ సాహితీవేత్తలు తమ కవితాహృదయాలను బహిర్గతం చేశారు.

"మట్టిలో నుండి వెలువడిన మణివరదన్న" అని దాశరధి కృష్ణమాచార్యులు.

"ప్రాణమున్న భావాలకు నీ నుడియే వాణికి గుడి
ఆకుపచ్చ ఊహలకే నీ కావ్యం ఆరని మడి
చక్కని కవితకు నిన్నే చెప్పుకుందునోయన్నా !
నిన్ను మించు కవియేడీ? ఉన్నాడొక పోతన్న
- అని డా॥సి. నారాయణరెడ్డి అభినుతించారు.

"పోతన చరిత్రము ప్రజా హృదయవీధుల నిర్మల ధర్మదేవతా లోకములన్" సృజింపగలదు" - కావ్యపఠనాంతరం దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రశంసించారు.

పోతన చరిత్రములోని భోగినీ దండకముతో రసానుభూతి చెందిన నటరాజ రామకృష్ణ" సహజ సుందర శైలిలో నిరాడంబరముగా భోగినీ విలాసమును వక్కాణించి తాము తాదాత్మ్యము చెంది చదువరుల దృష్టిలో భోగినికొక విశిష్టతను కల్పించి అందందే యంతర్లీన మందినారు. సంస్కృతాంధ్ర సాహిత్యముల యందు కావ్యాంతర్గతములైన నృత్య సన్నివేశములలో సూచనామాత్రముగా నృత్య దృశ్యము నభివర్ణించుటేగాని, నాటికిని నేటికిని నాట్యమున ఇంతటి ప్రాధాన్యమును తమకావ్యములలో గల్పించి కృతకృత్యులైన కవి పుంగవులు లేనేలేరు. మాళవికాగ్ని మిత్రములో సైతము కాళిదాసు కింతటి విపులముగా నృత్యమును జూపింపలేదు" అని కీర్తించారు.

ఇంత కీర్తి గడించిన ఈ మహాకావ్యమును వరదాచార్యుల వారు పోతనను గురించి లభ్యమైన కథాంశముల నన్నింటినీ సేకరించి పూర్వాపరాలు చెడకుండా, కావ్యోచితమైన వర్ణనలకు అనుకూలమగునట్లుగా విస్తరింపచేశారు. పన్నెండు ఆశ్వాసాలు, 3271 పద్యాలు గల పోతనచరిత్రము బమ్మెర గ్రామవర్ణన మొదలకొని రుక్మిణీ కళ్యాణ ఘట్టము వరకు కొనసాగింది. ప్రతీ ఆశ్వాసములోను ప్రకృతి రమణీయత, సందర్భానుసారంగా ఉపయోగింపబడిన అలంకార,

సామెతల, నుడికారాల సొగసులు చదువరులను ఆకట్టుకొంటాయి.

సముద్రము, ద్యూతము వంటి రెండు మూడు వర్ణనలు మినహాయించి ప్రబంధమువలె అష్టాదశవర్ణనలు ఈ కావ్యంలో ఉన్నాయి. ఈ వర్ణనలన్నీ సంస్కృతాంధ్రములలో కవికి గల పాండిత్యాన్ని తెలియజేస్తున్నాయి. శాంతిరసార్భూతమైన భక్తి ప్రధాన రసముగను, శృంగారాదులు అంగరసములు గను పోషింపబడినవి.

బమ్మెర గ్రామవర్ణన ఘట్టములోని
పూరియిండ్ల చుట్టు c బొదలు మొక్క పెరండ్లు
మొక్క పెరటి చుట్టు ముండ్లదడులు
దడులలోని కేcగు ద్వారాల పలుగాండ్లు
గుడిసె గుడిసె వెనుక పిడుకగూండ్లు.

ఈ ఆటవెలది కవి పరిశీలనాశక్తికి మచ్చుతునక. ఆ చార్యులకు రైతులన్న అపరిమితమైన మమకారము. పోతన జన్మస్థలమైన బమ్మెర గ్రామంలోని పంటచేలను వర్ణిస్తూ ఆ గ్రామాన్ని పాడిపంటల ముల్లెగా అభివర్ణించారు.

సీ. ముత్యాల చెండ్లెత్తి మురిపించు జొన్నచేల్
కర్షకశ్రమ బిందు ఘనతcదెల్పు
బంగారు గొలుసుల బరువుల మెడవంచు
వరిలక్ష్మిపాలేఱు వరుసవిప్పు
వెండికొండలు చెట్ల c బండించు ప్రత్తిచేల్
పశుపతిత్వము రైతు పరమొసర్చు c
జింక బిడ్డల cగొంచు సాcకెడు మొక్కచేల్
ప్రజకాcపు చంక పాపలని చూపు
తే. మేలిపంట పొలాల నాcగేలు చాలు
శ్రీమహాలక్ష్మియైన యాసీతనేలు
నేల నవధాన్య రత్న భూషాళిc దాల్చి
పాcడి పంటల ముల్లె యీ పల్లెయనcగ.



ద్వితీయాశ్వాసములో శ్రీ నాధుడు పోతనతో బమ్మెరకు వెళ్ళిన తర్వాత తల్లితో చెప్పి తన చెల్లిని పోతనకిచ్చి వివాహం చేయడానికి నిశ్చయించడం, పోతన వివాహఘట్టం అందంగా చిత్రీకరించబడింది. శ్రీనాధుని తల్లి కూతురిని అత్తవారింటికి పంపే సన్నివేశంలో తల్లి మనసును కవి ఎంత చక్కగా ఆవిష్కరించారో చూడండి.

సీ. తనయను గౌcగిట c దార్చుచు జనని యొదల
మూర్కొనుచు వీcపు కలయనిమిరి
యుప్పొంగి వచ్చు దుఃఖోర్మి మత్తడిదూcక
నెన్నcడు నను వీడి యెఱుcగ దనుచుc
గంటి నేనాcడొ యత్తింటి సొమ్మిద్దిమా
యింట నుండిన దని యెంతొ నను చుc
గవ్వంబులన్ బెట్టి కడుపులో నెవ్వరో
చల్లచేయుదురు నా యుల్లమనుచు
తే. కడుమనన్ బందుగను వట్టి గొల యనుచు c
గాంచి ప్రాణమెత్తుగc బెంచి కన్న కడుపు
నీ చెయింబెట్టితిమి పాలనేని ముంచు
నీటనే ముంచు భారమ్ము నీదె యనుచు.

నాట్యాచార్యుల ప్రశంసలన్నీ సొంతం చేసుకున్న చతుర్థాశ్వాసములోని భోగినీ నాట్యము ఘట్టాన్ని అభివర్ణించడం ఆ మహాకవికే సాధ్యం. భోగిని సౌందర్యాన్ని వర్ణిస్తూ.... చెక్కిచేసిన మోహినీ శిల్పమనcగ దిద్దితీర్చిన నవరత్న దీపమనcగ పోతపోసిన యపరంచి బొమ్మయనcగ అచ్చుమచ్చరయే యన నాలతాంగి

అంతటి సౌందర్యరాశి నాట్యాన్ని చూడటానికి రెండు కళ్ళూ చాలవేమో అన్నట్లుగా వర్ణించారు.

సీ. హంసముఖాకృతి నలరించునొక ముద్ర
భ్రమరాకృతుల నొందు భ్రమను గొల్పు
హరిణముఖాకృత్తి యనునొప్పునొక ముద్ర
యొగయు పతాకమై యెస cగు నొకటి
శంఖ చక్రాకృతుల్ సరిపోలు నొక ముద్ర
దర్పక బాణ సంధాన ముద్ర
శిఖరాకృతుల నధిక్షేపించునొక ముద్ర
యభయ ప్రదానహస్తాబ్జ మొకట
తే. ముకుళముద్రల భుజలతల్ మొగ్గదొడుగు c
బూర్ణ వికసిత ముద్రలc బూలుబూయు
వంపులను వ్రేళ్ళc బూరేకు సొంపులీను
క్షితిc గదలియాడు లత యీ నెలcత యనంగ.

కావ్యంలోని అశ్వాసాల ప్రారంభంలోని పురవర్ణన ప్రాతఃకాలవర్ణన, వసంత ఋతు వర్ణన, హిడింబాశ్రమ వర్ణన సహజ సుందరంగా ఉన్నాయి. తెలంగాణా ప్రాంత నుడికారాలను, మానవ నైజాన్ని తెలిపే తీరు గమనిస్తే,

ఒక బిక్షుకుడు గ్రామంలోనికి వచ్చి లోబిని భిక్షం అడిగే సన్నివేశాన్ని వర్ణించిన విధానం...

ఉ. కుక్కను బిల్వనా యనుచు c
గోమటి యొక్కcడు వచ్చి తాత సా
మ్మిక్కడ దాcచc బెట్టినటులేమొ పదేపది' బుక్కెడేయికా
ల్మొక్కెద నవ్వ' యంచు నిలుముంగిటc బాcతిన యట్టులుంటిపొ
మ్మెక్కడికే నcటంచు బిగియించుకొనెన్ దలుపుల్ ధడాలనన్

దశమాశ్వాసంలో పోతన కృతిని రామునకు సమర్పించుట, పోతన భాగవత ఫలశృతి సభాసదులకు తెలియచెప్పుట, కావ్యోప సంహారము వివరింపబడినది.

పోతన చరిత్రములో పాత్రలన్నింటినీ తీర్చిదిద్దడంలో ఆచార్యుల వారి నేర్పు ప్రశంసించదగినది. పోతన భక్తి వినయములను, పితృ, మాతృ, భాతృ భక్తిని, పరోపకార పరాయణతను, కవిత్వ పాండిత్యములను, వేదాంత వైరాగ్యములను సందర్భానుసారంగా వివరించారు. ఇంతటి మహాకావ్యాన్ని అనేక కష్ట నష్టాల కోర్చి మనకందించిన ఆచార్యుల వారి కీర్తి అచంద్రతారార్కము అమరము.

**(ఆగష్టు 16 వానమామలై వరదా చార్యుల శత జయంతి సందర్భంగా)**

**రచయిత్రి సెల్ : 9949431849**

కథ



# కారుణ్య మరణం

- డా॥ మల్లెమాల వేణుగోపాలరెడ్డి

సెల్ : 9573420474

"నాన్నా ఫోన్!" షర్మిల... లండన్ నుండి", అరవింద్ ఫోన్ నా చేతికిచ్చాడు.

"అమ్మా! షర్మిలా! ఎలా వున్నావమ్మా! విష్ణు బాగున్నాడా! హర్ష ఏమంటున్నాడు. కుశల ప్రశ్నలు.

"ఆఁ! ఫర్వాలేదు చిన్నాన్నా! హర్ష హైదరాబాద్‌లో అమ్మా, నాన్నల దగ్గర వున్నాడు. విష్ణు జాబ్‌లో బిజీ. చిన్నాన్నా! నాకు మూడు నెలల నుండి పొత్తి కడుపులో విపరీతమైన నొప్పి. మెన్సస్ ట్రబుల్. హెవీ బ్లీడింగ్, నీరసం."

"డాక్టర్లను కన్సల్ట్ చేశారా!" అడిగాను.

"చూపించాము. సి.టి. స్కాన్, ఎం.ఆర్.ఐ. పెట్ స్కాన్ అన్ని టెస్టులూ చేశారు. ఒవేరియన్ క్యాన్సరంటున్నారు. విష్ణు భయపడుతున్నాడు. ఇండియాకు పోదామంటున్నాడు" షర్మిల స్వరంలో తడబాటు.

"అయ్యో! క్యాన్సరన్నారా! ఏ స్టేజిలో వుందన్నారమ్మా!"

"స్టేజి ఇంకా చెప్పలేదు. విష్ణు మీకు ఫోన్ చెయ్యమన్నాడు. మీరు సర్జన్ కదా! అరవింద్ కూడా అంకాలజిస్టు కదా! మీరూ అమెరికాలో వున్నారని మీకు ఫోన్ చేస్తున్నాను. రిపోర్టులన్నీ మీకు ఈ.మెయిల్‌కు స్కాన్ చేస్తున్నాను. మీరు స్టడీ చేసి విష్ణుకు ధైర్యం చెప్పండి. ఇంకా ఈ విషయం అమ్మా, నాన్నలకు కూడా చెప్పలేదు. వాళ్ళు అప్‌సెట్ అవుతారని..."

ఒక చెవితో వింటున్నాను గానీ, రెండో చెవిలో నా గుండె వేగంగా కొట్టుకునే చప్పుడు వినబడుతుంది.

"మేము రిపోర్టులు చూసి, అవసరమైతే ఇక్కడి డాక్టర్లను కూడా కన్సల్ట్ చేసి నీకు రేపు ఫోన్ చేస్తాను. నువ్వు ధైర్యంగా వుండు.

ఎర్లీ స్టేజ్‌లో వుంటే సర్జరీ చేస్తే పూర్తిగా క్యూర్ అవుతుంది."

ఫోన్లో షర్మిళ స్వరంలోని దైన్యస్థితి నాకర్థమైంది.

రిపోర్టులన్నీ నేనూ అరవింద్ స్టడీచేశాం. అరవింద్ పనిచేస్తున్న 'గుడ్‌సామ్' మెడికల్ సెంటర్లో, సీనియర్ అంకాలజిస్టులతో చర్చించాం. వ్యాధి థర్డ్ స్టేజ్‌లో వుంది. సర్జరీ స్టేజ్ దాటిపోయింది. ఇక రేడియేషన్, కీమోథెరపీయే.

నా మెదడులో నరాలు చిట్లిన అనుభూతి, షర్మిలది చిన్న వయసు. ఇప్పుడు నయం కాని వ్యాధి. కళ్ళు మూసుకొని కూర్చున్నాను. అరవింద్ నా భుజం పట్టుకుని "కంట్రోల్ యువర్‌సెల్ఫ్ నాన్నా!" పెద్దనాన్నా, పెద్దమ్మలకు మీరే ధైర్యం చెప్పాలి. షర్మిలతో, విష్ణుతో నేను

మాట్లాడతాను". వాడి చెయ్యి వణుకుతుంది. కంఠంలో జీర.

నాలో ఎందుకింత మనోదౌర్బల్యం. అంతేనేమో! ఆత్మీయతా అనుబంధాలు నా మనస్సుని పట్టుకుని కుదిపితే, గుండెను తట్టి లేపుతున్నాయేమో! ఆర్ద్రత, ఆవేశంతో నిద్రపట్టేలేదు. ఆలోచన లోతుల్లో నేను...

. . .

షర్మిళ మా అన్న కూతురు. అన్న బ్యాంక్ మేనేజర్‌గా రిటైరయ్యాడు. నేను డాక్టరు కావడానికి ఆయన ప్రోత్సాహ, సహకారాలే కారణం. షర్మిళ ఆయన ఏకైక సంతానం. నాకూ అరవింద్ ఒక్కడే. షర్మిళకు కథా సాహిత్య పరిచయం వుంది. కథలూ, కవితలు రాస్తుంది. నా సాహిత్య ప్రస్థానానికి ఆమె కొంత విస్తృతి. షర్మిళ ఎం.ఎ. పాసయ్యింది. విష్ణు మేనేజ్‌మెంట్ కోర్సులో డాక్టరేట్ తీసుకుని లండన్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. షర్మిళ లండన్‌లోనే ఒక లైబ్రరీలో అసిస్టెంట్ లైబ్రేరియన్‌గా పనిచేస్తుంది. హర్ష వాళ్ళకున్న పన్నెండేళ్ళ కొడుకు. హైదరాబాద్‌లో అమ్మమ్మ, తాతయ్యలతో ఉంటూ చదువుకుంటున్నాడు. అరవింద్ మెడిసిన్ చదివి, సర్జికల్ అంకాలజిస్టుగా అమెరికాలో ఒహాయో స్టేట్‌లో పనిచేస్తున్నాడు. కొడుకులు లేనందుకు అన్నకూ, కూతుళ్ళు లేని లోటు నాకూ అరవింద్, షర్మిళలు తీరుస్తున్నారు. వాళ్ళిద్దరిదీ పరస్పరం అనురాగం... ప్రేమ...



వేసవి తీవ్రత తప్పించుకోవడానికి నేను మూణ్ణెల్ల కోసం అమెరికా వచ్చాను. మా ఆవిడ కడపలో ప్రముఖ గైనకాలజిస్టు. నర్సింగ్‌హోం ఆమె చూసుకుంటూ వుంది. నేను వెళ్ళిన తర్వాత ఆమె కొన్నాళ్ళ కోసం అమెరికా వస్తుంది. పదిహేనేళ్ళుగా ఇది మా రొటీన్.

సైన్స్‌పరంగా నేనూ, అరవింద్ షర్మిళకూ, మా అన్న వదినలకు అండగా వుండి ధైర్యాన్నివ్వవలసిన అవసరం...

మర్నాడు లండన్‌కు ఫోన్ చేశాను. "అమ్మా షర్మిళా! రిపోర్టులన్నీ స్టడీ చేశాం. మీరు ఇండియాకు వచ్చెయ్యండి. నేనూ అరవింద్ ఇండియా వస్తాం. అక్కడే ట్రీట్‌మెంట్ స్టార్ట్ చేద్దాం. నువ్వు ధైర్యంగా వుండు."

"అలాగే చిన్నాన్నా! మీ సలహా కోసమే ఎదురు చూస్తున్నాం."

ఆమె గొంతు గాద్గదికంగా...

అరవింద్ విష్ణుతో మాట్లాడాడు. ట్రీట్‌మెంట్ త్వరగా ప్రారంభించవలసిన అవసరాన్ని వివరించాడు.

. . .

మాకంటే నాలుగు రోజుల ముందే విష్ణు, షర్మిళలు హైదరాబాద్ చేరారు. ఎయిర్‌పోర్ట్‌లో విష్ణు మమ్మల్ని రిసీవ్ చేసుకున్నాడు. మా ఆవిడ అప్పటికే హైదరాబాద్ వచ్చి వుంది. మా అన్నా వదినెలకు వ్యాధిని గురించి వివరించి సమాధానపరచినట్టుంది. ఆ ఛాయలు వాళ్ళ ముఖాలలో కన్పించాయి.

స్నానం చేసి అన్న గదిలోకి వెళ్ళి కూర్చున్నాను.

"క్యాన్సరంటే నాకు భయంగా వుంది. పాపకెలా వచ్చిందో మరి ఈ మహమ్మారి వ్యాధి. చిన్న వయస్సు. ఆమె మా ప్రాణం. వ్యాధి తీవ్రత గురించి నీకూ, మీ ఆవిడకు, అరవింద్‌కే తెలియాలి. విష్ణు మాకిస్తున్న ధైర్యమే మా బలం.. విష్ణు, షర్మిళలు ఇంటికొచ్చేశారనే సంతోషమే తప్ప మీ వదినెకు ఇంకో ఆలోచన లేదు. నువ్వు చెప్పు షర్మిళ ఈ గండం నుంచి బయటపడుతుందా".. అన్న మాట్లాడుతున్నంత సేపూ నేను మౌనంగా వింటున్నాను. ఆయన కంట తడిని గమనిస్తున్నాను.

"మీరు ధైర్యంగా వుండండి. వ్యాధి మంచిది కాదు. నిజమే కానీ ఇప్పుడు వివిధ పరిశోధనల వల్ల క్యాన్సరుకు చికిత్స సులభమైంది. మీరు చింతిస్తూ వదినెకు దిగులు పెట్టకండి. మేం వచ్చేశాం కదా!"

"సరే! మన చేతిలో ఏముంది. మనం చేయగలిగేదేముంది. నువ్వు రెస్ట్ తీసుకో. నేను అరవింద్‌తో మాట్లాడతాను." ఆయన మాటల్లో తాత్విక చింతన.

అరవింద్ హర్ష కోసం తెచ్చిన క్రికెట్ బ్యాట్, రిస్ట్ వాచ్, టీషర్టులు వాడికిచ్చారు.

"థాంక్స్ అంకుల్!" వాడి ముఖంలో ఆనందం. పన్నెండేళ్ళ వయసులోని ఉత్సుకత. వాడు పరుగెత్తుకెళ్ళి ఫ్రెండ్స్‌తో చేరిపోయాడు. మా ఆవిడ నాతో "షర్మిళను క్లినికల్‌గా ఎగ్జామ్ చేశానండీ! ట్యూమర్ ప్రక్క అవయవాలకూ వ్యాపించింది. పెద్ద ప్రేగులు, మూత్రనాళాలకు పాకింది. షర్మిళ బాధపడుతూ వుంది. ఆధ్యాత్మిక చింతన వున్న అమ్మాయి కాబట్టి బాధ భరించడానికి ప్రయత్నిస్తుంది. అయినా శరీర బాధను భరించాలి గదా! నాకు ఆశ్చర్యంగా వుంది. ఇంత షార్ట్ టైంలో ఇంత తీవ్రంగా కావడం. త్వరగా రేడియేషన్ స్టార్ట్ చెయ్యాలి" అంది.

నిజమే. షర్మిళకు ఆధ్యాత్మిక చింతన ఎక్కువ. కొర్లకుంట ఆశ్రమంలో వేసవి ఆధ్యాత్మిక శిబిరంలో వరుసగా నాలుగేళ్ళు నెలరోజుల పాటు పాల్గొంటూ వుండేది. ఆ తర్వాత లండన్ వెళ్ళారు. అందుకే ఆమెలో కొంత మానసిక పరిపక్వత. ఇప్పుడామెకు అది కొంత ధైర్యాన్నిస్తున్నది.

తిరుపతి నుండి విష్ణు అమ్మా, నాన్నలు వచ్చారు. అందరిలోనూ షర్మిళను గురించిన ఆందోళనే.

విష్ణు, అరవింద్ హైదరాబాద్ క్యాన్సర్ ఇన్‌స్టిట్యూట్‌లో అంకాలజిస్టులతో అపాయింట్‌మెంట్ తీసుకొచ్చారు.

. . .

ఇన్‌స్టిట్యూట్‌లో సర్జికల్ అంకాలజిస్టు, మెడికల్ అంకాలజిస్టు ఇద్దరు షర్మిళను ఎగ్జామ్ చేశారు. రిపోర్టులన్నీ చూశారు. అరవింద్‌తో, నాతో చర్చించారు. వ్యాధి సర్జరీ స్థితిని దాటిపోయింది. రేడియో, అంకాలజీ

థెరపిస్టులతో చర్చించారు. రేడియేషన్ ట్రీట్‌మెంట్ స్టార్టు చెయ్యాలని తీర్మానించారు. రెండు నెలల పాటు ఆరు ఎక్స్‌పోజర్సు. లండన్‌లోనూ అదే ట్రీట్‌మెంట్ సజెస్టు చేశారన్నాడు విష్ణు. ఇక్కడేమైనా సర్జరీ వీలవుతుందని ఆశపడ్డామన్నాడు. అసాధ్యాలను ఎక్కడైనా సుసాధ్యం చేయగలమా? ఇప్పుడు రెండో ఆలోచనకు తావు లేదు. విష్ణు, షర్మిళలకు నచ్చచెప్పాం. ట్రీట్‌మెంట్ కోసం షర్మిళను ఇన్‌స్టిట్యూట్‌లో చేర్పించాం. రెండు ఎక్స్‌పోజర్స్ తర్వాత డిశ్చార్జి చేయించుకొని డాక్టర్ల సలహా మేరకు ఔట్ పేషెంటుగా ట్రీట్‌మెంట్ కొనసాగించేందుకు ఏర్పాటు చేసి, అరవింద్ అమెరికాకు, మేము కడపకు బయల్దేరాం.

. . .

రేడియేషన్ రోజుకు ప్రతిసారీ నేను హైదరాబాద్ వెళ్ళి వస్తున్నాను. షర్మిళకు కొంతలో కొంత ఉపశమనం వుందని విష్ణు అంటున్నాడు. కానీ ఆమె ముఖంలో కళాకాంతులు లేవు. పలకరిస్తే కంట తడి. రెండు నెలల రేడియేషన్ కోర్సు పూర్తయింది పరీక్షలు చేసి "కీమో థెరపీ" అవసరమని నిర్ధారించారు.



షర్మిళ చాలా బలహీనంగా వుంది. రక్తహీనత. కీమోథెరపీకి తట్టుకోలేదేమోననే సందేహం. రెండు బాటిల్స్ రక్తం ఎక్కించారు. నేనూ, అన్న చెరొక బాటిల్ రక్తం ఇచ్చాం. మా రక్తం సరిపడింది. 'మీ రక్తాన్ని నేను తాగుతున్నాను నాన్నా! ఇలాంటి పరిస్థితి ఎవరికీ రాకూడదు" షర్మిళ మాటలు మమ్మల్ని కృంగదీస్తున్నాయి. ఆమెను ఓదార్చలేకపోతున్నాం.

"చిన్నాన్నా! మీరూ. పిన్నమ్మా అమ్మకూ, నాన్నకూ, విష్ణుకి ధైర్యం చెప్పాలి. నేనింకెన్నాళ్ళో బ్రతకను. ఆ విషయం నాకూ, మీకూ తెలుసు. ఈ వ్యాధి నయం కాదు. మీరుండగా వాళ్ళను గురించి నాకు దిగులు లేదు. హర్షను గురించే నా ఆలోచన. కానీ విష్ణు చాలా మంచివాడు. వాడి బాగోగులు చూసుకుంటాడని నా ధైర్యం. ఆపైన ఏడుకొండలవాడున్నాడు. ఆమెలో వేదాంత ధోరణి.

. . .

కీమో థెరపీ స్టార్ట్ చేశారు. నేనూ, మా ఆవిడ మార్చి మార్చి వచ్చి షర్మిళకు ఆసరాగా వుంటున్నాం.

అన్నకు షర్మిళను గురించిన చింత. వదినెను ఎంత ఓదార్చినా ఆమె వేదన తీరడం లేదు. తన ప్రేమానురాగాల పట్టి... ఏకైక కూతురు. ఒక విషాద స్థితిలో... నిద్రాహారాలు తగ్గించేసింది. ఇప్పుడామెకు వైద్యం చేయవలసిన అవసరమొచ్చింది. విష్ణు తన బాధను ఎంత అణచుకోవాలని ప్రయత్నించినా, ముఖంలో విషాదఛాయలు ప్రస్ఫుటమవుతున్నాయి. హర్షకు కూడా షర్మిళ కండిషన్ అర్ధమైంది. చదువు మీద శ్రద్ధ పెట్టలేకున్నాడు. క్రికెట్ బ్యాట్ బీరువా పైకెక్కింది. షర్మిళ ఒడిలోనో, పడకమీదనో తలదూర్చుకుని మౌనంగా కూర్చుంటున్నాడు. కీమోథెరపీ సగం కోర్సుకే షర్మిళ చిక్కిశల్యమైంది. తరచూ ప్లేట్‌లెట్స్ ట్రాన్స్‌ఫ్యూజన్స్ ఇస్తున్నారు. భరించరాని బాధ. మూలుగుతో ప్రారంభమై బిగ్గరగా అరిచే స్థితిలో... ఇన్‌స్టిట్యూట్‌లో నెలరోజులకు పైగా... తల వెంట్రుకలు ఊడిపోయాయి. కళ్ళు లోతుకు పోయాయి. ప్రక్కటెముకలు బయటపడ్డాయి. నోటి పుండు... ఆహారం తీసుకోలేకపోతున్నది. ఐ.వి. ఫ్లూయిడ్స్ ఇస్తున్నారు. యూరిన్ పైపు ద్వారానే మత్తు ఇంజెక్షన్స్. రెండు గంటలు కూడా పనిచేయడం లేదు. అరవింద్ చాలా ఖరీదైన మందులు అమెరికా నుండి పంపిస్తున్నాడు. అన్ని విధాలా చికిత్స ముమ్మరం చేసినా స్వస్థత లేదు. విష్ణు, మా ఆవిడ నైట్ డ్యూటీ. నేనూ, అన్న పగలు డ్యూటీ. వదినె ఇంటి పని, ఎవరికీ కునుకు లేదు.

"పిన్నమ్మా! నేనింక బ్రతకను. ఈ నరకయాతన నేను పడలేను. మీ అందరికీ కష్టం కల్గిస్తున్నాను. నా అరుపులతో హాస్పిటల్లో రోగులకూ, సిబ్బందికీ ఇబ్బంది కల్గిస్తున్నాను. డాక్టర్లు నన్ను "హోం ఫర్ ఇన్‌క్యూరబుల్స్"కు షిఫ్ట్ చేస్తే బాగుంటుందని విష్ణుతో చెప్పడం నేను విన్నాను. ఎన్నని ఈ మత్తు ఇంజెక్షన్లు.. ఎన్నాళ్ళూ నాపై ఈ ప్రయోగాలు... నన్ను ఈ అవస్థ నుండి తప్పించండి చిన్నాన్నా. నువ్వు ఇక్కడి డాక్టర్లతో మాట్లాడి నాకు కారుణ్య మరణాన్ని ప్రసాదించే ఏర్పాట్లు చేయండి. విష్ణుని నేను ఒప్పిస్తాను. మామయ్య, అత్తమ్మ, అమ్మా, నాన్నలను మీరు ఒప్పించండి. ఇప్పుడు మెర్సిఫుల్ కిల్లింగ్ కొన్ని పరిస్థితులలో చట్టబద్ధమైందట గదా! మీకు తెలియని దేముంది!

షర్మిళ తనతో చెప్పిన మాటలను మా ఆవిడ యధాతథంగా నాకు చెప్పి బాధపడింది.

ఆపై మత్తు ఇంజెక్షన్ ప్రభావం తీరిపోగానే కొంతసేపు జాగ్రదావస్థ. షర్మిళ పడక ప్రక్కనే నేను ఒంటరిగా కూర్చుని వున్నాను.

"చిన్నాన్నా! నా బ్యాగ్‌లో నా డైరీ వుంది. అందులో బుక్‌మార్క్ పెట్టిన చోటు నుండి కొన్ని పేజీలు చదవండి... నా కోసం... మళ్ళీ మగత నిద్రలోకి జారుకుందామె.

. . .

డైరీ తీసి చదవసాగాను.

కొర్లకుంట ఆశ్రమంలో వేసవి శిబిరంలో నాలుగోసారి పాల్గొంటున్నాను. అమ్మ శారదమ్మగారు ఉదయం భగవద్గీత, సాయంత్రం ఉపనిషత్తులపై వ్యాఖ్యానం. ధ్యానం, యోగా, పూజా కార్యక్రమాలు, భజనలు. రోజువారీ దినచర్యగా ఆశ్రమవాసులూ శిబిరంలో పాల్గొనే జిజ్ఞాసువులు ఆసక్తిగా పాల్గొంటున్నారు.

పది ఎకరాల విస్తీర్ణంలో కుటీరాలు, ఉద్యానవనం, వేదపాఠశాల, విశ్వేశ్వరాలయం, గోశాల, వ్యవసాయ క్షేత్రం, ప్రశాంత వాతావరణం.

గోశాలలోని 'శివలీల' గోమాత. శారదమ్మగారికి అత్యంత ప్రీతిపాత్రమైంది. నాలుగేళ్ళ క్రితం ఒక కోడెదూడకు జన్మనిచ్చింది. ఆ కోడెదూడ 'సంజీవి'. కోడెవయసులో వ్యవసాయ క్షేత్రంలో ఉపకరణం.

ఈసారి శివలీల రోగగ్రస్థమైంది. వీపున పెద్ద పుండు. చీము, నెత్తురు కారుతూ దుర్వాసనతో, ఈగలు ముసురుతూ చిక్కిపోయింది. గడ్డి మేయదు. మూలుగుతూ, ఉన్నట్టుండి 'అంబా' అని అరుపులతో బాధపడుతూ...

గోశాల నిర్వాహకుడు నారాయణస్వామి రోజూ పుండు క్లీన్ చేసి బ్యాండేజీ వేస్తాడు. కాకులు ముక్కుతో బ్యాండేజీని చిందర వందర చేస్తాయి. పుండును కెలుకుతాయి. మళ్ళీ రక్తం. ఈగలు... ఆ మూగజీవి తన బాధను మాటలతో చెప్పలేదు. 'అంబా' 'అంబా'నే దాని వేదనా భాష, ఘోష. నోటి నుండి సొంగ, కంటి నీటి ధారలు శివలీల బాధకు గుర్తులు. ఆ దృశ్యం చూడటానికీ దుర్భరం. నేనెళ్ళి శివలీల నుదుట పసుపు రాసి, కుంకుమ దిద్ది, కొమ్ములకు పూలు చుట్టి వస్తాను. శివలీల తన సంతోషాన్ని తల ఊపుతూ వ్యక్తపరుస్తుంది. కోదూరు వెటర్నరీ డాక్టరు ఇచ్చి పంపిన కొన్ని ద్రావకం మందులు నారాయణ స్వామి శివలీల గొంతులో పోస్తాడు. అరటి పండ్లు, గంజి శివలీల ఆహారం. 'అంబా' అని అరచినప్పుడల్లా 'సంజీవి' 'అంబా' అని ప్రతిధ్వనిస్తాడు. కొన్నిసార్లు పరుగెత్తుకొచ్చి శివలీల కాళ్ళు నాకుతాడు.



శారదమ్మ గారికి శివలీలను గురించిన ఎడతెగని ఆలోచన. ఇన్నాళ్ళుగా అమ్మ ఆహారంలో పాలు, పెరుగు, నెయ్యి అన్నీ శివలీలవే. శివలీల నుదురు తాకి అమ్మ ఓదారుస్తుంటే తల ఆడిస్తూ, తోక విసురుతూ అమ్మకు సంతోషాన్ని పంచుతుంది.

. . .

శివలీల బాధ నా గుండెల్లో ముల్లు గుచ్చుకున్న ఫీలింగ్. ఆ రాత్రి లీలగా కలలో శివలీల.. మానవ భాషలో..

"అమ్మా! నాకు మీరిచ్చే పసుపు కుంకుమలకు నేనెంతో రుణపడ్డాను. నేను పాలిచ్చి మీ రుణం తీర్చుకోలేని దుస్థితి. నేను నరక యాతనలో వున్నాను. వైద్యం పనిచేయడం లేదు. ఈ పశు జన్మకు చస్తే గానీ ఈ బాధ పోదు. ఇది రాచపుండట. డాక్టరుగారంటే విన్నాను. ఇప్పుడు నాకు చావే మోక్షం. మీరు నాకో సాయం చేయండి. అమ్మగార్ని ఒప్పించి నాకు కారుణ్య మరణభిక్ష పెట్టించండి. మళ్ళీ ఈ గోశాలలోనే పుట్టి మీ అందరి రుణం తీర్చుకుంటాను... లీలగా శివలీల అభ్యర్థన. నా గుండె వేగంగా కొట్టుకుంది. తెల్లవారింది. శివలీలను చూశాను. పుండుమీద బ్యాండేజీ లేదు. రక్తం, ఈగలు, బాధతో తలను నేలకేసి బాదుకుంటూ. కాళ్ళ వద్ద పడుకుని సంజీవి.

శారదమ్మగారికి శివలీల గోడు వినిపించాను. అమ్మగారు వెటర్నరీ డాక్టరుకు ఫోన్ చేశారు. కారుణ్య మరణం గురించి అంగీకారం కుదిరింది. ఫార్మాలిటీస్ అయిపోయాయి. శిబిర వాసులందరి సమక్షంలో డాక్టరు శివలీల నరాలకు నాలుగు ఇంజెక్షన్లు వేశాడు. "తలా, కాళ్ళు కొట్టుకుంటూ, తనకలాడీ, తనకలాడీ దీర్ఘంగా నిశ్వసించి, ఊపిరి వదిలింది. సంజీవి 'అంబా, అంబా' అనే అరుపులతో ఆశ్రమమంతా పరుగెత్తసాగింది. శివలీలకు పసుపు, కుంకుమలు రాశాను. కొమ్ములకు పూలు చుట్టాను. విశ్వేశ్వరాలయం తోటలో భూస్థాపితమైంది శివలీల. ఆ తర్వాత అమ్మగారు శివలీలకు సమాధి కట్టించారు.

డైరీ మూసేసాను. శివలీల, జీవకారుణ్యం, కారుణ్య మరణ ఘట్టాన్ని కథా గమనంతో షర్మిళ నా చేతికందించి తన పరంగా చేస్తున్న అభ్యర్థనగా నాకు తోచింది. కథన శైలిని మెచ్చుకున్నాను. అన్నా వదినలతో, విష్ణుతో, అతని తల్లిదండ్రులతో షర్మిళ కారుణ్య మరణాన్ని గురించి ప్రస్తావించాను. అందుకు వారెవరూ అంగీకరించలేదు. హాస్పిటల్ రూల్స్ ప్రకారం వారి అంగీకారం లేకుంటే అలా చేస్తే అది నేరం.

షర్మిళ ప్రక్కన కూర్చున్నాను. పెద్దగా అరుపులతో కూడిన ఏడుపు. ఆమె గుండె మీద చేయివేశాను.

"చిన్నాన్నా! నాకు ఇంజెక్షన్లు వద్దు. మరణభిక్ష కావాలి. మీరిచ్చే కారుణ్య వరంతో మరణించి, మళ్ళీ జన్మించి అరవింద్‌కు కూతురవుతాను. మీ సాహిత్య ప్రస్థానాన్ని కొనసాగిస్తాను. షర్మిళ నా రెండు చేతులూ గట్టిగా పట్టుకుని ఏడ్చింది. ఆమె కంటి నీరు నా చేతుల్ని తడిపాయి. నా గుండెల్లోకి ప్రాకి గుండెను తడిచేశాయి. ఒళ్ళు జలదరించింది.

వ్యాధి తీవ్రమయ్యింది. గుండెకు మానిటరింగ్, డయాలసిస్, వెంటిలేటర్‌పై శ్వాస, కొంతకాలం అలాగే వైద్యం సాగితే ఆమె ఆరోగ్యం మెరుగుపడుతుందేమోనని మా వాళ్ళ ఆశ. అది సాధ్యం కాదని నాకు తెలుసు.

. . .

నేనూ, మా ఆవిడ హాస్పిటల్ డాక్టర్లు, డైరెక్టరూ కలిసి చర్చించాం. బంధువుల అంగీకారం, సంతకాలు, సమ్మతిని ఆడియో రికార్డింగ్, ఇతర ఫార్మాలిటీస్ పూర్తికానిదే మెర్సిఫుల్ డెత్‌కు ఉపక్రమించడం సాధ్యం కాదు. ఆ నిబంధనలకు మావాళ్ళెవరూ అంగీకరించరు. మధ్యేమార్గంగా "ఐ.వి. ఫ్లూయిడ్స్, మానిటర్స్, డయాలసిస్, వెంటిలేటర్, మెడిసిన్స్ విత్‌డ్రా చేస్తే... నాలుగు రోజుల్లో ఆమె మరణిస్తుంది. అదీ మా చర్చల పర్యవసానం. మా వాళ్ళకు తెలియకుండా లైఫ్ లైన్ కొనసాగిస్తున్నట్లే చేసి... మందులు విత్‌డ్రా చేసే ఏర్పాటు చేయించగలిగాను.

షర్మిళ కోమాలో ఉంది.

ఇంకో నాలుగు రోజుల్లో షర్మిళ కథకు ముగింపు.

అంతవరకూ మగత నిద్రలో ఆమె... మమతల వలయంలో మావాళ్ళూ.

వ్యథాభరిత నిరీక్షణలో నేనూ... ♦

## బుల్లితెర ఓ కూనలమ్మా

- తియ్యగూర సీతారామిరెడ్డి
సెల్ : 9491336258

బూటకపు బుల్లితెర
కంటికి కమ్మిన పొర
తేటతెలివి హరహర
ఓ కూనలమ్మా



కల్లబొల్లి కబుర్లు
బుల్లి తెరల విసుర్లు
మదిని గప్పు ముసుర్లు
ఓ కూనలమ్మా

టి.వి. ఓ చెద పుట్ట
భవితకు ఆనకట్ట
మంత్రనగరపు చిట్ట
ఓ కూనలమ్మా

బుల్లి తెరకు బానిస
చిల్లిపడిన మానస
చెల్లని సత్తు పైస
ఓ కూనలమ్మా

సినీతారల మోజు
మనిషికున్న బూజు
ఎప్పుడొదిలే రోజు?
ఓ కూనలమ్మా

బుల్లి టి.వి. ఛానళ్ళు
కుళ్ళిన రాచపుళ్ళు
తెలివి పక్కకు మళ్ళు
ఓ కూనలమ్మా

## ఎవరికి

- కోనే సతీష్‌కుమార్
సెల్ : 9553784387



అక్కడ మొక్కలు ఎదగటం లేదు
అక్కడ పంటలు పండటం లేదు
నరమాంసం పండుతుంది
నరమేధం సాగుతుంది
కన్నీటి చుక్కలు లేవు
కారుణ్య సంద్రం ఎండిపోయింది
పుట్టిన మనిషి... చెడిపోతున్నాడు
జననం కాలుష్యం అవుతుంది
జీవన దృశ్యం... సిగ్గు... సిగ్గుగా
ప్రతీ దృశ్యం దగాపడుతుంది
ప్రేమలన్నీ పారిపోతున్నాయి
అబద్ధాల అనుబంధాల్లో
అదోలా జీవితం
ప్రయాణాలన్నీ
స్వార్థగమ్యానికి
పెరట్లో కాలక్షేప దేశభక్తి
వాకిట్లో విసిరేస్తున్న ఆకలి
స్పందించే
హృదయం సరదాలకి
మనకి... మనమే కావాలి
మట్టిజీవులు ఎవరిక్కావాలి

## రసాయనిక చర్య

- రాపోలు పరమేశ్వరరావు
సెల్ : 99514 16618

కర్మ సిద్ధాంతపు కర్మాగారంలో
శ్రమైక్య జీవన ప్రవంతి
చిన్నాభిన్నమైనపుడు
మనుధర్మ కుల విభజన
జాత్యహంకారాలు
ధనస్వామ్య దృక్కోణం నుండి
సూత్రీకరిస్తున్నపుడు
తెల్లనీతి 'నల్ల'గా మారినపుడు
మతమౌఢ్యం అపక్రమ భిన్నాలుగా
ఎవడి కాళ్ళు వాడే నరుక్కుంటాడు
ఎవడి కళ్ళు వాడే పొడుచుకుంటాడు
రంగు రూపు దేశాలు ఖండాలు అనే
విభజన లేని మానవ అవయవ నిర్మాణం
ఏకదృష్టితో లిఖితమైన మహా కావ్యం!
ఒకటి ప్లస్ ఒకటి
'ఈక్వల్' టు ఒకటి అనే
నవీన గణిత శాస్త్రం మానవుడు!!
ఆ మానవాకారాలకు
'ఆకలి' అనే బాధ కూడా ఒకటే!
ఆ ఆకలికి ఆహారం
అనుదినం అవసరమేనన్న నగ్నసత్యాన్ని
ఏ అధికారాలు ఆయుధాలు
అణచలేవు!
మూఢవిశ్వాసాల విశ్లేషణలో
వ్యత్యాసాలు సాదృశ్యాలై
ధనికుడు పేదవాణ్ణి



దోచుకునే దృశ్యాలై
బలహీనులను బానిసలుగా మార్చే
నిరక్షరాస్య నిశీధి
చిన్న మెదడును జోకొట్టే
మత్తుమందు!
పాలనా మేధస్సు
భేతాళ మాంత్రికమైనపుడు
ఆలోచనారాహిత్య
రసాయనిక చర్య జరుగుతుంది!
తరతరాల దోపిడీకి
పచ్చ జెండా ఎగురుతుంది!!

## రెక్కలు

- మోపిదేవి రాధాకృష్ణ
సెల్ : 9849349516



చిన్న గదీ
చిట్టి వసారా
భార్యా..
పిల్లలూ -

సగటు జీవనమే
కళ !

లక్షల ఖరీదు
'వాచ్' అయినా
సూచించే
సమయం ఒక్కటే -

వజ్రాలు తొడగదు
దివా రాత్రి !

హారతి పళ్లెంతో
భారత్
ప్రపంచీకరణకు
ఘన స్వాగతం -

కర్పూర గుళికలే
దేశ ప్రజలు !

భరించే శక్తి
అలవరచుకుంటే
రట్టు కాదు
ఇంటి రగడ -

బాదినా
సాల చెంతే గొడ్డు !

బాధ్యతల
ధర్మానికి
బాల్యం
బలైతే -

బోన్సాయే
ప్రతిభ !

భావాల
బుల్లి తెరే
నీ
మనసు -

అక్షర మేడ
కవిత్వం !



# సజీవపాత్రల సృష్టికర్త ఖుర్రతులైన్ హైదర్

- డా॥ దేవరాజు మహారాజు

కాలానికి, చరిత్రకు తలవంచని రచయితలు ఎవరూ ఉండరు. ఉరుదూ మహారచయిత్రులలో ఒకరైన ఖుర్రతులైన్ హైదర్ కూడా అంతే. టాల్‌స్టాయ్‌లాగా ఆమె కూడా చరిత్ర గొప్పతనానికి తలవంచారు. తన ఆత్మకథను చరిత్రతో మిళితంచేసి 'కారె జహ ద్రజ్ హై' అనే ఉద్గ్రంథాన్ని రచించారు. అది మనిషి మనుగడను ప్రతిబింబించే మ హోన్నత రచన అని విమర్శకులు కితాబునిచ్చారు. కలల్లో తేలిపోయే యువతులు, తిరుగుబాటు ధోరణితో రాటుదేలిన పురుషులు ఆమె కథల్లో ఎక్కువగా కనిపిస్తారు. ఖుర్రతులైన్ శైలి మృదుమధురంగా, సరళంగా, సాఫీగా ఉంటుంది. ఆత్మీయతా బంధం, ఒక దగ్గరితనం ఆమె పదాల్లో ద్యోతక మౌతుంది. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు, భారతీయ జ్ఞానపీఠ్ అవార్డూ అందుకున్న ఈ రచయిత్రి రచనలెన్నో ఇతర భారతీయ భాషల్లోకి, ప్రపంచ భాషల్లోకి అనువాదమయ్యాయి. అబ్దుల్ ముగానీ (1985) రాసిన 'ఆర్ట్ ఆఫ్ ఖుర్రతులైన్ హైదర్' జి.సి.నారింగ్ సంపాదకత్వం వహించిన ఉర్దూ షార్ట్ స్టోరీ ట్రెడిషన్స్ అండ్ ప్రాబ్లమ్స్ (1981) అనే రెండు ఆంగ్ల గ్రంథాల ద్వారా ఉర్దూ తెలియనివారు ఖుర్రతులైన్ సాహితీ ఔన్నత్యాన్ని కొంతవరకు అవగాహన చేసుకోవచ్చు.

రచయిత్రి ఖుర్రతులైన్ హైదర్, సజ్జాద్ హైదర్, శ్రీమతి నజర్ సజ్జాద్ హైదర్ యాల్డ్రమ్ దంపతులకు 1927లో ఉత్తరప్రదేశ్‌లోని బిజునూర్ జిల్లాలో పుట్టారు. కొద్దిపాటి అక్షర జ్ఞానం కలగగానే ఆమె కలం పట్టారు. 1939లో తన పన్నెండవయేట కథ రాసి ప్రచురించారు కూడా! పదిహేడేళ్ళు వచ్చేసరికి ఏకంగా నవలలు రాయడం ప్రారంభించారు. ఇతివృత్తం, శిల్పం, పాత్రపోషణ వంటి వన్నీ బాల్యదశలోనే ఆమె ఎలా ఆకళింపు చేసుకున్నారన్నది ఆశ్చర్యం కలిగించే విషయమే. ఏదో రాసిందంటే రాసిందన్నట్టుగా కాకుండా, ఆమె నవలలన్నీ (1949-52) వెనువెంటనే ప్రచురింపబడి, గొప్ప సంచలనం కలిగించాయి. ఆమె వయసు చిన్నదైనా, ఆమె తాహతుకు మించిన సంక్లిష్టమైన సమస్యల్ని తీసుకుని నవలలు రాశారు. మెరెభి సనమ్ ఖానే (పూజించే విగ్రహాలు), సఫీనా-ఎ గమే ఎ దిల్ (ఒంటరిగా తేలియాడే దుఃఖించే హృదయం), ఆగ్‌క దరి యా, ఆఖిరే షబ్‌కె హంసఫర్: కరే జహా ద్రజ్ హై (The Task of Life in Long) గర్దిషే రంగే చమన్ (The Circle of Life in a Constant Whirl). ఇవేకాక దిల్ రుబా (The Heart Throb) సీతాహరణ్, చాయ్ కె బాగ్ (టీతోట) అగిలే జనమ్ మొహె బిటియాన కిజో, హౌజింగ్ సొసైటీ - వంటి నవలలెన్నో (1949-89) నలభైయేళ్ళ కాలంలో వెలువరించి, అగ్రశేణి ఉరుదూ రచయితల్లో ఆమె తన స్థానాన్ని సుస్థిరం చేసుకున్నారు.

నవలా రచయిత్రిగానే కాదు. కథా రచయిత్రిగా కూడా ఆమెకు సమున్నతస్థానం లభించింది. దేశ విభజనను ప్రత్యక్షంగా చూసి ఖుర్రతులైన్, తన కథారచనకు ఆ ఇతివృత్తాన్నే ఎన్నుకున్నారు. భారత-పాకిస్తాన్‌ల విభజనవల్ల ఉన్ని కుటుంబాలు అస్తవ్యస్తమయ్యాయో, ఎన్ని అఘాయిత్యాలు జరిగాయో, ఎంతటి బీభత్సం జరిగిందో ఆమె ప్రత్యక్షంగా అనుభవించారు. ఆ అనుభవాల ఆధారంగానే ఆమె గొప్ప జీవిత కథల్ని సృష్టించగలిగారు. "ఆగ్ క దరియా" అనే కథ విశేష ప్రాచుర్యాన్ని పొందింది. ఆ కథకు ఇతివృత్తం దేశ విభజనే అయినా, దేశకాల పరిస్థితుల్నీ, కాలాన్నీ, అధిగమించి గొప్ప కథగా ఇప్పటికీ నిలబడింది. అందులో రచయిత్రి ఎత్తి చూపిన జీవిత సత్యాలు నేటి పరిస్థితులకు కూడా అన్వయించుకునే విధంగా ఉన్నాయి. ఆమె రాసిన కొన్ని వందల కథలు నాలుగు సంపుటాలలో పొందుపరచబడి ఈతరం పాఠకులకు అందుబాటులో కొచ్చాయి. సితారోంకి అగె (చుక్కలకు ఆవల), శీషే కె ఘర్ (గాజు ఇల్లు), పత్ ఝర్‌కి ఆవాజ్ (రాలుతున్న ఆకుల చప్పుడు). రోషనీక రఫ్తార్ (కాంతి వేగం) మొదలైన సంపుటాలు 1947-82 మధ్య కాలంలో

## కలయిక

- జి. హరీష్
సెల్ : 9505242567

ఎప్పుడు కలిసి
ఎప్పుడు విడిపోయామో
తెలియదు
ఇప్పుడు మళ్ళీ కలిసాము
దాహమున్నంత తృప్తి
తృప్తి ఉన్నంత దాహం
ఇప్పుడు కూడా ఉంది
దాహము తృప్తి కవలపిల్లలు
అంగడములో దాగుడుమూతలు
ఆడుతున్నట్టనిపిస్తుంది



## ఆమె

అందరూ అంటారు
ఆమె లేదని
నేనంటాను
ఆమె ఉన్నదని
సాక్షి?
నేనే!
ఆమె లేకపోతే
నేను లేకపోయేవాణ్ణి కదా!

## కాలమంటే

బ్రతుకు
రంగులలో
మన రంగును
కలిపేది

## బ్రతుకు

బ్రతుకంటే
చిత్రమూ కావచ్చు
తలరాత కావచ్చు
మనకిష్టమున్న రంగులతో
రూపొందితే చిత్రం
ఇష్టములేని రంగులతో
యేర్పడితే తలరాత!

## ఆ మూడు రోజులు

మనంత మనము
సరదాగ అడుగులు వేసేవారము
అది గతం
నేనిప్పుడు ఢిల్లీ వదిలి
మరొక నగరానికి పోతున్నాను
అక్కడ నాకిష్టమైన ఉద్యోగం దొరికింది
వెళ్ళడానికి ఇంకా మూడు రోజులున్నాయి
నీవన్నావు
ఆ మూడు రోజులు
నాకోసమే!

## బైపాస్

మేలుకొన్నవాడికి బ్రతుకు
ప్రతి మలుపులో వేచి వుండి
ఎదురు వస్తుంది!
పడుకొన్నవాడిని బ్రతుకు
మౌనంగా బైపాస్ చేస్తూ
వెళ్ళిపోతుంది

## గజల్

నీవు వెళ్ళిపోతే
బ్రతుకొక
గజల్ అవుతుంది!
నీవు తిరిగి వస్తే
గజలే
బ్రతుకవుతుంది!

## మౌనంగా

మౌనంగా
పూవులా
వికసించాలనిపిస్తుంది
తావిలా... అలా... అలా...
గాలిలో
కలసిపోవాలని కూడా

---

వెలువడ్డాయి. కొన్ని అనేక పునర్ముద్రణలు పొందాయి. పత్ ఝగ్‌కి ఆవాజ్ (1967) అనే సంపుటి మాత్రం పాకిస్తాన్‌లో పదేళ్ళ తర్వాత (1977లో) విడిగా ప్రచురణ పొందింది.

దేశ విభజన సమయంలో కష్ట నష్టాలకు గురైనా, ఆ తర్వాత ఖుర్రతులైన్ భారత్ పాకిస్తాన్ దేశాల మధ్య ఒక వారధిలా పని చేశారు. ఆశ్చర్యం కలిగించే విషయమేమంటే అక్కడ ఆమె చాలా కీలకమైన పదవుల్ని అలంకరించి, ఇరుదేశాల మధ్య సుహృద్భావానికి, మైత్రీ సంబంధాలకు ఎంతగానో కృషిచేశారు. బాల్యంలోనే రచనపట్ల ఆకర్షితురాలైన హైదర్ చదువును ఎప్పుడూ అశ్రద్ధ చేయలేదు. లక్నో విశ్వవిద్యాలయం నుండి 1947 లోనే తన ఇరవైయవ యేట ఆంగ్ల సాహిత్యంతో ఎం.ఏ.చేశారు. తర్వాత లక్నోలోని స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చిత్రకళ నభ్యసించారు. కొంతకాలం తర్వాత లండన్ వెళ్ళి అక్కడ కూడా ఆ అధ్యయనాన్నే కొనసాగించారు. ఆ సమయంలోనే వీరికుటుంబం పాకిస్తాన్‌కు వలస వెళ్ళింది. కాని, తిరిగి వచ్చి మళ్ళీ భారతదేశంలోనే స్థిరపడింది. ఏదో ఒకటి చేయాలన్న దృఢ సంకల్పంతో హైదర్, ప్రముఖమైన పలు పత్రికలలో సంపాదకవర్గ సభ్యురాలిగా పని చేశారు.

దేశ విదేశాలలో పర్యటించడం, యూరోపియన్ సాహిత్యం ఎక్కువగా చదవడంవల్ల ఆమె కొన్ని యాత్రా రచనలు, కొన్ని అనువాదాలూ చేయగలిగారు. ముఖ్యంగా వర్జీనియా వుల్ఫ్ ప్రభావానికి లోనై చైతన్య స్రవంతిలో రచనలు చేశారు. 'మెరె భి సనమ్ ఖానె'. 'సఫీనా, గమే దిల్', సితారోంసె ఆగె' వంటివన్నీ ప్రయోగాత్మక రచనలే! 'ఆగ్ క దరియా' లోని గౌతమ్ నీలాంబర్ అనే ఉద్యమకారుడి పాత్ర, ఇతర కథల్లోని దాపాలి, నసీరా, రక్షందా, చంపా, ఖమ్రాన్ వంటి స్త్రీ పాత్రలు సమాజంలోని వ్యక్తులవలె సజీవంగా నిలిచిపోయాయి. ఉరుదూ సాహిత్య ప్రియులు ఆ పాత్రల్ని వ్యక్తులుగానే భావించి ప్రేమిస్తారు. గౌరవిస్తారు.

రచయిత సెల్ : 9908633949

## కథ

# తెరిచెయ్




ఊర్దూ మూలం : సాదత్ హసన్ మంటో

అనువాదం : నిఖిలేశ్వర్

సెల్ : 9177881201


**అమృత్‌సర్ నుంచి మధ్యాహ్నం రెండు గంటలకు బయలుదేరిన స్పెషల్ ట్రెయిన్ ఎనిమిది గంటల ప్రయాణం తర్వాత ముగల్‌పురా చేరుకుంది. దారిలో ఎంతోమంది చంపబడ్డారు. ఎంతోమంది గాయపడ్డారు. మరికొంత మంది అటు, ఇటు చెదిరిపోయారు.**

**ఉదయం పది గంటలు**

**కాందిశీకుల ప్రత్యేక శిబిరంలో చల్లటి నేలపై సిరాజులుద్దీన్ కళ్ళు తెరిచి చూశాడు. తనచుట్టూ ఆడవాళ్ళు పిల్లాళ్ళు మనుషుల సముద్రం. తనకు ఆలోచనాశక్తి నశించిపోతున్నట్టు వుంది. పైన నల్లగా వున్న ఆకాశాన్ని సిరాజులుద్దీన్ తదేకంగా చూశాడు శిబిరంలో విపరీతంగా సందడి చప్పుడు, అయినా అతని చెవులు మూసుకుపోయినట్టు అనిపించింది.**

నల్లని ఆకాశాన్ని తదేకంగా చూస్తున్న సిరాజులుద్దీన్ దృష్టి సూర్యుడి వైపు మళ్ళింది. తీవ్రమైన కాంతి అతని అస్తిత్వాన్ని మేల్కొల్పింది. అతను మేల్కొన్నాడు, మెదడులో ఎన్నో చిత్రాలు పరిగెడ్తున్నాయి. దోపిడి, మంటలు, పరుగు, స్టేషన్, తుపాకి గుళ్ళు రాత్రి, సకీనా!

సిరాజులుద్దీన్ పిచ్చివాడులా గబాలున లేచి నిలుచున్నాడు. నలువైపులా పరిచుకున్న మానవ సముద్రాన్ని చూపులతో వెతకడం ప్రారంభించాడు.

"సకీనా సకీనా అంటూ అతడు మూడు గంటలపాటు ఆ శిబిరంలో కేకలు వేస్తూ తిరిగాడు. అంతా గందరగోళం. ఎటు చూసినా ఒకర్ని ఒకరు వెతుక్కుంటూ మనుషులు, సిరాజులుద్దీన్‌కు వయస్సులో వున్న తన కూతురు సకీనా ఎక్కడా కనపడలేదు. ఆ శిబిరంలో కొడుకు కోసం తల్లి, తల్లికోసం కూతురు. భార్య కోసం భర్త. ఇలా మనుషులు కేకలు వేస్తూ నిస్సహాయంగా వెతుకుతున్నారు. సిరాజులుద్దీన్ చివరికి విసిగి వేసారి ఒకమూల కూర్చున్నాడు. "సకీనాను తాను ఎక్కడ వదిలేశానా" జ్ఞాపకశక్తినంతా కూడగట్టుకుని గుర్తుచేసుకునే ప్రయత్నంలో వున్నాడు.

అలా జ్ఞాపకం చేసుకుంటూ వుండగా తన భార్య శవం గుర్తుకువచ్చింది. పేగులు బయటికి వేలాడుతూ పడిపోయిన తన భార్య శవం. అంతే ఇంకేమీ ఆలోచించలేక పోయాడు సిరాజులుద్దీన్.

సకీనా తల్లి చనిపోయింది, సిరాజులుద్దీన్ కళ్ళ ఎదుటే ఆమె ప్రాణాలు వొదిలింది. చనిపోయే ముందు "సకీనా ఎక్కడుంది? నన్ను వదిలేయండి అమ్మాయిని వెంటబెట్టుకుని వెంటనే ఇక్కడి నుంచి పారిపొండి" అని ఆమె భర్తను కోరింది.

సకీనా తండ్రితోబాటే పరిగెత్తుతూ వుంది. చెప్పులు లేని కాళ్ళతో ఇద్దరు పరుగుపెడుతున్నారు సకీనా భుజాలపై వుండే

దుపట్టా కిందపడిపోయింది సిరాజులుద్దీన్ ఆ దుపట్టా (వోణి) కోసం ఆగాడు. "నాన్నగారు పోనివ్వండి ఆ దుప్పట్టా అని ముందుకు వెళ్ళిన సకీనా అరిచింది అయినా అతను ఆ దుపట్టాను తీసుకొని షేర్వాని లోపల దాచి పెట్టుకొన్నాడు. అంతే జ్ఞాపకాలు చెదరిపోయాయి. షేర్వాని లోపలి జేబులోంచి దుపట్టా తీసి చూసుకున్నాడు సిరాజులుద్దీన్, కానీ సకినా ఎక్కడుంది?

సిరాజులుద్దీన్‌లో ఎన్నో ప్రశ్నలు కాని జవాబులు ఎక్కడా లేవు. అతనికి సానుభూతి కావాలి. కాని నాలుగు వైపులా చిందరవందరగా పడివున్న ఆ మనుష్యులందరికీ సానుభూతి కావాలి. సిరాజులుద్దీన్ భోరున ఏడవాలనుకొన్నాడు కాని కళ్ళల్లో కన్నీళ్ళేవి?

ఆరు రోజుల తర్వాత సిరాజులుద్దీన్ చివరికి మామూలు మనిషిగా ఇతరులతో మాట్లాడుతున్నాడు. తన కూతురును వెతికి పెట్టడానికి కొందరు యువకులు సిద్ధమయ్యారు.



ఆ యువకుల దగ్గర ఒక లారీ, కొన్ని తుపాకులు వున్నాయి, సిరాజులుద్దీన్ ఆ యువకులను మనసారా దీవిస్తూ సకీరా పోలికలు చెప్పాడు. "గులాబి రంగు, ఎంతో అందంగా వున్న అమ్మాయి... అంతా తల్లిపోలికే... పదిహేడు సంవత్సరాల వయస్సు... పెద్ద పెద్ద కళ్ళు, పొడుగాటి నల్లని కురులు, కుడిచెంపపై లావాటి పుట్టు మచ్చ నా ఒక్కగానొక్క కూతురు వెతికి తీసుకురండి. మిమ్మల్ని దేవుడు చల్లగా చూస్తాడు"

ఆ కాందిశీకులైన ఆరుగురు యువకులు ప్రాణాలకు తెగించి సకీనా కోసం వెతకడం ప్రారంభించారు. ధైర్యంగా అమృత్‌సర్ దాకా వెళ్ళారు.

పదిరోజులు గడచిపోయాయి. కాని వాళ్ళకు సకీనా మాత్రం ఎక్కడా కనపడలేదు.

ఒకరోజు ఆ ఆరుగురు యువకులు తిరిగి ఆ అమ్మాయికోసం అమృత్‌సర్ వెడుతున్నారు. వాళ్ళ లారీ అమృత్‌సర్ పొలిమేరల్లోకి రాగానే పక్కనే రోడ్డుపై ఒక అమ్మాయి కనబడింది. వాళ్లు లారీ ఆపారు.

ఆ అమ్మాయి భయంగా పక్క పొలాల్లోకి పరిగెత్తడం ప్రారంభించింది. ఆ ఆరుగురు యువకులు ఆమెను వెంబడించి పట్టుకున్నారు. ఎంతో అందమైన అమ్మాయి పెద్ద పెద్ద కళ్లు కుడిచెంపపై లావాటి పుట్టు మచ్చ.

"నీ పేరు సకీనా కదూ?" అని వాళ్ళు అడిగారు ఆమె చెంపలు మరింత ఎరుపెక్కాయి భయంతో. ఆ ఆరుగురు యువకులు ఎంతో అనునయలతో సకీనాకు ధైర్యం చెప్పారు.

అన్ని విధాల వాళ్ళు ఆమెకు నమ్మకం కలిగించారు. భోజనం పెట్టి పాలు తాగించి ఆమెను లారీలో కూర్చోబెట్టుకున్నారు సకీనా వొంటిపై దుపట్టా లేదు. ఆమె ఎంతో సంకోచంతో తన చేతులు అడ్డుపెట్టుకుంటూ లారీ మూల వొదిగింది. ఒక యువకుడు కప్పుకోమని సకీనాకు తనకోటు విప్పి ఇచ్చాడు.

ఎన్నో రోజులు గడచిపోయాయి. సిరాజులుద్దీన్‌కు సకీనా జాడ అంతుపట్టలేదు. శిబిరంలో ప్రతిమూలా వెతికాడు ఆమె ఎక్కడా కనపడలేదు.

ఒకరోజు సిరాజులుద్దీన్ శిబిరంలోకి వచ్చిన ఆ ఆరుగురు యువకులను చూశాడు. ఆదుర్ధాగా పరిగెత్తి తన కూతురు విషయం అడిగాడు. ఆమెను వెతికి తనకు అప్పగించితే దేవుడు వాళ్ళకు ఎంతో మేలు చేస్తాడని దీవించాడు. ఆ యువకులు లారీ ఎక్కి బయలుదేరబోతున్నారు. సిరాజులుద్దీన్ లారీ వెంట పరిగెడుతూ "బాబు మా అమ్మాయి సకీనా ఎక్కడుందో వెతుకుతారు కదూ?" అని బతిమలాడాడు. ఆ లారీలోంచి ఒక యువకుడు నిర్లక్ష్యంగా "అలాగే వెతుకుతాంలే" అని జవాబు చెప్పాడు.

మరికొన్ని రోజులు గడచిపోయాయి.

ఒకరోజు సాయంత్రం శిబిరంలో దారి ప్రక్కనే సిరాజులుద్దీన్ కూర్చునివున్నాడు. ఇంతలో కొంత సందడి నలుగురు వ్యక్తులు ఏదో మోసుకొస్తున్నారు. దగ్గరగా వెళ్ళి చూస్తే నిండాబట్ట కప్పి తీసుకొస్తున్నారు. దగ్గరలోనే వున్న రైల్వే లైను పక్క స్పృహ తప్పి పడిపోయిన ఒక అమ్మాయిని వాళ్ళు మోసుకొస్తున్నారు.

సిరాజులుద్దీన్ వెనకాలే నడిచివెళ్ళాడు. ఆ వ్యక్తులు ఆ అమ్మాయిని ఆసుపత్రి సిబ్బందికి అప్పజెప్పి వెళ్ళిపోయారు. అతను మెల్లిమెల్లిగా లోపలికి వెళ్ళాడు.

గదిలో ఎవరూ లేరు. స్ట్రెచర్ పై మాత్రం ఆ అమ్మాయి శవంలా పడుకొని వుంది. సిరాజులుద్దీన్ మెల్లిగా చిన్న చిన్న అడుగులు వేస్తూ దగ్గరగా వెళ్ళాడు. హఠాత్తుగా గదిలో వెలుగు. సిరాజులుద్దీన్ ఆ శవం కుడి చెంపపై వున్న పుట్టు మచ్చ చూశాడు వెంటనే అరిచాడు.

"సకీనా"

గదిలో లైట్లు వెలిగించిన డాక్టర్ అతని వైపు చూసి అడిగాడు "ఏమిటి"

సిరాజులుద్దీన్ అతి కష్టం మీద అనగలిగాడు "డాక్టర్ సాబ్... డాక్టర్ సాబ్... ఈమె తండ్రిని నేను!"

డాక్టర్ ముందుకు వచ్చి స్ట్రెచర్‌పై వున్న శవాన్ని చూశాడు. నాడి వెతికి పరిక్షించాడు సిరాజులుద్దీన్‌తో అన్నాడు

"కిటికీ తెరిచేయ్..."

నిర్జివమైన సకీనా శరీరంలో ఆకస్మాత్తుగా కదలిక ఆమె తన నిర్జీవమైన చేతులతో తాను వేసుకున్న శల్వార్ (షరాయి) తాళ్ళు విప్పి నడుంకిందుగా జరుపుకుంది నగ్నంగా సకీనా శరీరం.

ముసలి సిరాజులుద్దీన్ ఆనందంతో అరిచాడు "బతికే వుంది... నా కూతురు బతికే వుంది.

డాక్టర్‌కు పై నుంచి కింది దాకా ముచ్చెమటలు పోశాయి.

***(ఆంధ్రజ్యోతి పత్రికలో 12.02.1984న ప్రచురితం)***

# ఆధునిక చరిత్ర



- వి. వెంకట్రావు

**మనం అప్పుడప్పుడు చరిత్ర పుస్తకాలు కూడా చదువుతుంటాం. చరిత్ర లాగా కనిపించేదంతా చరిత్ర కాదు. చాలా వరకు చరిత్ర పుస్తకాల్లో కనిపించేదంతా రాజుగారి కీర్తికాంక్ష రాణిగారి విలాసాల వివరాలు. రాజ్య విస్తరణ. అందులోని వీరత్వం అలాంటి యుద్ధాల్లో సామాన్య ప్రజలు, ప్రాణాలకు తెగించి, వీర మరణం పొందడం ఇంకా ఇలాంటివే.**

గడిచిన కాలంలో ఏం జరిగిందో చెప్పడమే చరిత్ర అనుకుంటే అది కూడా చరిత్రే. అయితే అది మాత్రమే చరిత్ర కాదు. ఇంకా ఉంది. అది ప్రజల చరిత్ర. పేద ప్రజల చరిత్ర. చరిత్రలో పేద వర్గం, జనాభాలో అధిక శాతం ప్రజలు ఎలా బ్రతికారో ఆనాటి ఫ్యూడల్ ప్రభువుల పరిపాలనలో ఎలా విసిగిపోయారో ఎలాంటి బాధలు పడ్డారో అధిక పన్నులు కట్టలేక ఎలా తిరగబడ్డారో ఆనాటి రాజులూ, పెద్ద పెద్ద జమిందారీలూ, భూస్వాములు సాధారణ ప్రజలను ఎలా పీడించీ, ఎలాంటి బాధలు పెట్టారో, ఇంకా చరిత్రలో ఏమేమి జరిగాయో అది తెలిస్తే అదీ అసలైన చరిత్ర. "ఇతి హాసపు చీకటి కోణం, అట్టడుగు పడి కన్పించని, కథలన్నీ కావాలిప్పుడు, దాచేస్తే దాగని సత్యం" అని శ్రీశ్రీ అన్నట్లు దాచేస్తే దాగని సత్యాలెన్నో.

ఈ మధ్యకాలంలో నేను చదివిన చరిత్ర పుస్తకాల్లో విలువైనది "ఆధునిక చరిత్ర." ఈ పుస్తకం గురించి ఎంత చెప్పినా తక్కువే. మహా సముద్రం నుండి గ్లాసెడు నీళ్ళను తియ్యడం ఎలాంటిదో ఈ పుస్తకం గురించి ఈ చిన్న వ్యాసం రాయడం కూడా అలాంటిదే.

దాదాపు ప్రతి పేజీలోనూ యుద్ధాలే. అంతా తిరుగుబాట్లే. పుస్తకం అంతా రక్తపు మరకలే.

మానవజాతి చరిత్రలో అనేక దశలు. బానిసయుగం నుండి రాచరికపు వ్యవస్థ, రాచరికపు వ్యవస్థ నుండి పెట్టుబడి దారీ వ్యవస్థగా మారింది, మారింది అనుకోవడమేగానీ, ఎలా మారిందో ఎందుకు మారిందో ఆనాటి ప్రజలకు తిరగబడక తప్పని, అనివార్య పరిస్థితులేమిటో మనకు తెలియదు. ఈ పుస్తకం చదివితే కళ్ళ ముందు సాక్షాత్కరించినట్లుగా అనిపిస్తుంది.

మొత్తం ప్రపంచంలోని మానవ సమాజం అంతా ప్రతి దేశంలోనూ పేదవర్గం రైతులూ, కార్మికులూ అన్ని పేద వర్గాల వారు దాదాపు ఒకే రకమైన బాధలు అనుభవించినవారే.

ఈ పుస్తకంలోని కొన్ని ఆసక్తికరమైన పేరాలు,

1788లోని ఫ్రాన్స్ దేశంలోని పరిస్థితులు

(పేజి నెం 98,99) రైతులూ, పట్టణ పేదలూ చేసే తిరుగుబాట్లు యేడాది కేడాదికీ బలపడుతూ వుండినాయి. ఉదాహరణకు, డిజాన్‌లో, తిండిలేని కార్మికులూ, రైతులూ, బ్రెడ్డు కావాలని అధికారులను డిమాండు చేసినారు." బీళ్లలో గడ్డి కొల్లలుగా వుంది. పోయి తినండి" అనే అపహాస్యం ఎదురైంది వాళ్ళకు.

అంతకంతకూ ఎక్కువ మంది రైతులు ఆర్థికంగా నాశనం కావడంతో ఖజానాకు చెల్లించే పన్నులు తగ్గిపోయినాయి. కానీ రాజు తన చాపల్యాలకూ, ఖరీదైన బహుమతులకూ, కోట్లు ఖర్చు పెడుతూనే వుండినాడు. ఉదాహరణకు, తనకు మరొక కొత్త భవనం అవసరమని రాజుకు సరదా కలిగింది. మంత్రుల సమావేశాల్లో కూడా తాగి తూలుతూ వుండే రాజు వీడే. వెంటనే కోటి నాణాలతో ఒకటి కొన్నారు. రాజుకు తీసి పోకూడదని రాణీ తనకూ పారిస్ సమీపంలో ఒక కొత్త అంతఃపురం కావాలని కోరింది. వెంటనే 60 లక్షల నాణాలకు మరొకటి కొన్నారు. ఆ సమయానికల్లా ప్రజల నుండి పెద్ద ఎత్తున డబ్బు రావడం అసాధ్యమైపోయింది. బూర్జువాలు రాజుకి అప్పులు ఇవ్వడానికి నిరాకరించినారు. డబ్బు కొరత క్రమక్రమంగా తీవ్రమౌతూ వచ్చింది. రోగుల కోసం కేటాయించిన డబ్బూ, ఆసుపత్రుల కోసం వసూలు చేసిన డబ్బూ, రాజు కోసం మంత్రులు అక్రమంగా ఖర్చులు పెట్టినారు".

రాచరికపు వ్యవస్థపై విసుగు చెందిన సామాన్య ప్రజలు రాజుపై తిరుగుబాటు చేసి, రాజుని జైల్లో పెట్టడమూ, కొన్ని దేశాల్లో రాజుని ఉరి తియ్యడమూ కూడా జరిగింది.

(పేజి : 105) 1792 ఆగస్టు 9వ తేదీన రాత్రి ప్రమాద ఘంటలు (యుద్ధ ఘంటలు) మ్రోగ సాగినాయి. గంటల శబ్దం విని సాయుధులైన పౌరులు "పారిస్ కమ్యూన్" హాలు వద్దకు ప్రవాహప్రాయంగా రాసాగినారు. ఆగస్టు 10వ తేది తెల్లవారేటప్పుడు తుపాకులూ, పిస్టళ్ళూ, బరిసెలూ ధరించిన ప్రజలూ, వాళ్ళ సహాయార్థం రాష్ట్రాల నుండి వచ్చిన దళాలూ, 'పారిస్ కమ్యూన్' నాయకత్వాన, రాజ ప్రసాదం మీద దాడి చేసినాయి... కానీ, రాజు ఎక్కడా కనిపించలేదు. అతను తప్పించుకొనిపోయి, శాసనసభ హాలులో శరణు జొచ్చినాడు. శాసనసభ, విప్లవ ప్రజలకు భయపడి, రాజును అధికారం నుండి తొలగించింది. కానీ, రాజు పారిస్‌లోనే ఒకరాజ ప్రసాదంలో ఉండటానికి అనుమతించింది. అప్పుడే పారిస్ కమ్యూన్, రాజుని అరెస్ట్ చెయ్యాలని డిమాండ్ చేసింది. తర్వాత, రాజు సకుటుంబంగా జైలులో వుంచబడినాడు. ఆ విధంగా 1792 ఆగస్టు 10వ తేదీన ఫ్రాన్స్‌లో రాజరికం కూలదోయబడింది".

కోపోద్రిక్తులైన ప్రజలు రాజుకి ఉరిశిక్ష వేసిన సందర్భాలు కూడా చరిత్రలో చాలా జరిగాయి.

(పేజి 66) 1649 జనవరిలో, కామన్సు సభ, ఇంగ్లాండు, క్రియలో రిపబ్లిక్‌గా (డీ ఫాక్టో రిపబ్లిక్‌గా) వున్నట్లు గుర్తించి, రాజును విచారణ చేయడానికి 135 మంది సభ్యులు గల ఒక న్యాయ సభను ఏర్పరచింది. అదే 1649 జనవరిలో, ఆ సభ ఇంగ్లండు రాజైన మొదటి ఛార్లెస్ మాతృదేశంతో యుద్ధం చేసి దేశద్రోహ నేరం చేసినట్లు తీర్పు ఇచ్చి, పెద్ద గుంపుగా కూడిన ప్రజల సమక్షంలో అతన్ని ఉరితీసినారు."

దాదాపు ప్రపంచంలోని అన్ని దేశాల పరిస్థితి ఇదే. ఈనాటి మన భారతదేశంలో ప్రస్తుత పాలకులతో విసిగిపోయి. ఆనాటి బ్రిటిష్ పాలకులే నయం అనే మాటలు వింటుంటాం. కానీ ఆనాటి మనదేశంలో కూడా పరిస్థితులు చాలా దయనీయంగానే ఉండేవి.

పేజీ నెం "221,222" 19వ శతాబ్ది మధ్య నాటికి, ఇంగ్లండు వలసకారులు భారతదేశంలో స్థిరపడి నూరేండ్లు అయింది. ఆ నూరేండ్లలో వాళ్ళు, భారతదేశంలో పురాతన చేతివృత్తులనూ, స్వతంత్ర రైతు సమాజాలనూ, ధ్వంసం చేసి, స్వతంత్ర రైతులను కౌలు రైతులుగా మార్చినారు. సేద్యపు నీటి వ్యవస్థల నిర్వహణను ఇంగ్లండు వాళ్ళు నిర్లక్ష్యం చేయడంతో అవి అక్కరకు రాకుండా పోయినాయి. పొలాలను కలుపు మొక్కలు ఆక్రమించినాయి. చాలామంది రైతులు, తమ వనరులన్నీ సమాప్తి అయినందున, పొలాలు వదిలి పెడుతూ వుండినారు. కానీ, వాళ్ళను వెదికి పట్టుకుని వారి నుంచి అధికార్లు పన్నులు వసూలు చేసే వాళ్ళు. డబ్బు కట్టలేని వాళ్లను వలస అధికార్లు చిత్రహింసలకు గురిచేసేవాళ్ళు. ఉదాహరణకు, వాళ్ళను తలక్రిందులుగా వేళ్ళడాదీయవచ్చు. తలవెంట్రుకులతో వేళ్ళదదీసి కాళ్ళకు రాళ్ళు కట్టవచ్చు. వ్రేలిగోర్ల క్రింద పుల్లలుగుచ్చవచ్చు. తండ్రీనీ, కొడుకునూ కలిపి కట్టి వేసి బాదడం ద్వారా శారీరక బాధతో పాటు మానసిక బాధ కూడా కలిగించవచ్చు. కండ్లు పొడిచివేయవచ్చు పన్నులు కట్టనందుకు ఈ రకపు బాధలు.

18వ శతాబ్ది మధ్య నుండి 19వ శతాబ్ది మధ్య వరకు జరిగిన ఆ నూరేండ్లలో ఇంగ్లండు బూర్జువావర్గం, భారతదేశం నుండి 1,200 కోట్ల బంగారు రూబుళ్లకు తక్కువ గాకుండా సంగ్రహించింది.

పేజి నెం 308, "1896 నుండి 1906 లోపల భారతదేశంలో కోటిమంది జనం ఆకలితో మాడి చచ్చిపోయినారు. భారతీయుని సగటు ఆయుఃప్రమాణం 24 సంవత్సరాలు ఇంగ్లీషు వానికి 46 సంవత్సరాలు. 20వ శతాబ్దపు తొలిరోజుల్లో భారతీయ రైతు తినే ఆహారం, అతని తాతలు తింటూ వుండిన దాంట్లో అర్థ (50%) మాత్రమే. అతని ముత్తాతలు తింటా వుండిన దాంట్లో మూడింట ఒక భాగం (33%) మాత్రమే."

ఆవిరి యంత్రాన్ని జేమ్స్ వాట్ కనిపెట్టాడని చరిత్ర పుస్తకాల్లో మనం చదివాం.

కానీ జేమ్స్‌వాట్ కంటే ఇరవై ఏళ్ళ ముందే ఇవాన్ పోల్జునావ్ అనే రష్యన్ కనిపెట్టారు. ఆ వివరాలన్నీ ఇందులో ఉన్నాయ్.

(పేజీ నెం : 76) "జేమ్స్ వాట్ కంటే 20 ఏండ్లు ముందే, ఇవాన్ పోల్జునావ్ అనే రష్యన్ ప్రజ్ఞాశాలి, మరొక రకమైన ఆవిరి యంత్రం సృష్టించినాడు. ఆ యంత్రం బాగానే పనిచేసేది. కానీ దాస్యవృత్తి అమలులో వుండిన ఆనాటి రష్యాలో, శరీర శ్రమ చౌకగా వుండేది కాబట్టి, అనేక సంవత్సరాలు గడిచిన తర్వాత గానీ అక్కడ ఆవిరి యంత్రం వ్యాప్తిలోకి రాలేదు".

ఇక్కడ గమనించవలసిన విషయం ఏమిటంటే మానవ శ్రమ కారుచౌకగా లభిస్తున్నంతకాలం కొత్త రకం వస్తువుల ఆవిష్కరణ జరగదు. ఎప్పుడైతే మానవశ్రమ తక్కువగా లభ్యం అవుతుందో అంటే కార్మికుల జీతాలు పెరగడం లాంటివి. అప్పుడు వస్తూత్పత్తిలో పెట్టుబడి అధికం, లాభాలు తగ్గడం లాంటివి జరుగుతాయో ఇక అప్పుడు వస్తువు ఇంకా తక్కువ ధరకు ఎలా తయారవుతుందో పెట్టుబడి దారుడు ఆలోచిస్తాడు. అలాంటి సందర్భాలలో ఇంకా ఇంకా తక్కువ శ్రమతో ఎక్కువ ఉత్పత్తి జరిగేటటువంటి యంత్ర విధానాన్ని కనిపెట్టడంలో శాస్త్రజ్ఞుల పాత్రను గుర్తించి ప్రోత్సహిస్తాడు. అందుకే చరిత్రలో ఆవిరి యంత్రం కనిపెట్టడానికి ఇరవై సంవత్సరాలు అదనపు కాలం వృధా అయింది.

ఈ పుస్తకం నిండా ఇలాంటి సంఘటనలు కోకొల్లలుగా ఉన్నాయి. ఈ పుస్తకంలో ఒక్క పేజీ మిస్ అయినా ఎంతో చరిత్ర మనం చదవడం మిస్ అయిపోయినట్లే.

ఈ పుస్తకాన్ని ఆరుగురు రష్యా రచయితలు ఎన్నో పరిశోధనలు చేసి రష్యన్ భాషలో రాస్తే, ఇద్దరు అనువాదకులు ఇంగ్లీషులోనికి అనువాదం చేస్తే, దాన్ని రాచమల్లు రామచంద్రారెడ్డి తెలుగులో అనువాదం చేసారు. అది 1967లో వచ్చింది. ఆ పుస్తకాన్ని ప్రగతి ప్రచురణలు పేరిట ఇటీవల రెండవ ముద్రణ పొందింది. ఇందులో రంగనాయకమ్మ గారి ఫుట్ నోట్ల సహకారం కూడా ఉంది.

చదివిన పేజీ మళ్లీ చదవాల్సిన అవసరం లేకుండా చక్కని అనువాదం. ఈ పుస్తకం మనం చదవడమే కాదు. మలితరం వాళ్ళు కూడా చదవడానికి వీలుగా మన ఇంట్లో భద్రంగా దాచి ఉంచుకోవాలి. ప్రగతి ప్రచురణలు ఈ పుస్తకాన్ని లాభాపేక్షత్ కాకుండా నష్టాపేక్షతో అతి తక్కువ ధరకు అందించారు.

**రచయిత సెల్ :9247235401**

# పాలకుల అండతోనే లక్షింపేట దళితుల హత్యాకాండ



- జాన్‌వెస్లి

**శ్రీకాకుళం జిల్లా వంగర మండలంలోని 12 గ్రామాల్లోని ప్రభుత్వ, రైతుల భూములు 7,779 ఎకరాలు మడ్డువలస ప్రాజెక్టు కోసం ప్రభుత్వం సేకరించింది. అందులో భాగంగా లక్షింపేట గ్రామమంతా నిర్వాసిత గ్రామమైంది. గ్రామంలో 75 దళిత, 75 తూర్పుకాపుల, 11 ఇతర బిసి కులాల కుటుంబాలున్నాయి. ఇంటి స్థోమతను బట్టి పెత్తందార్ల ఇంటికి లక్ష రూపాయల చొప్పున, దళితలవి పూరి గుడెసెలే కాబట్టి రూ. 3 వేల నుంచి రూ. 12 వేల లోపు ప్రభుత్వం నష్ట పరిహారం చెల్లించి గ్రామాన్ని ఖాళీ చేయించింది. పై భాగాన ఉన్న ముత్యాలమ్మ చెరువు దగ్గర ఇళ్ళ స్థలాలు ఇచ్చి ఎస్సీలు, కాపులకు పక్క పక్కనే పునరావాసం కల్పించింది. భూములు కోల్పోయిన రైతులకు ప్రభుత్వం నష్టపరిహారం చెల్లించింది. దళితులు భూములే లేని కూలీలైనందున వీరికి ఎలాంటి నష్ట పరిహారం ఇవ్వలేదు.**

ఉదయాన్నే లేచి కూలీ పనికి వెళ్ళేందుకు చద్దన్నం తింటున్న సుందర్‌రావును ఇంట్లో నుంచి బయటకు ఈడ్చుకొచ్చి బరువైన బండరాయిని ఎత్తి గుండెల మీద వేసి చంపేశారు. ప్రాణాలు కాపాడుకునేందుకు పక్క వీధిలోకి పరుగెడుతున్న నివర్తి సంగమేశును తోడేళ్ళలా వెంటాడి బరిసెలతో పొడిచి, గొడ్డళ్ళతో నరికేశారు. వీధిగుండా వెళ్తున్న వెంకటిపై నాటుబాంబులతో దాడి చేసి, బరిసెలతో పొడిచి, గాయాల మీద కారం చల్లి కాలువలో పడేశారు. ఇంట్లో ఉన్న చిత్రి అప్పడును భార్య పిల్లల కళ్ల ముందే బండరాళ్ళతో తలను పగులకొట్టి అత్యంత కిరాతకంగా హత్యచేశారు. పాపయ్యను కళ్లల్లో కత్తులతో, ఒంటినిండా బరిసెలతో 30 పోట్లు పొడిచారు. ఆ నెత్తుటి మడుగులో కొట్టుకున్న పాపయ్య కాసేపటికే ప్రాణాలు విడిచాడు. కొందరికి రెండు కాళ్ళూ విరిగాయి. మరికొందరికి కాళ్ళూ, చేతులూ విరిగాయి. ఇంకొందరికి ఒక కాలు, ఒక చేయి విరిగి, తలలు పగిలాయి. ఒకరికి చెవి తెగింది. మరికొందరికి వేళ్ళు విరిగాయి. దళితవాడలోని ప్రతి ఇంటిపై దాడి జరిగింది. మహిళలు, వృద్ధులను సైతం కర్రలతో గొడ్లను బాదినట్లు బాదారు. ప్రతి మనిషికీ కందిపోయిన గాయాలయ్యాయి. ప్రతి ఇంటిగోడకూ దళితుల రక్తపు మరకలే. 200 మంది తూర్పు కాపు పెత్తందార్లు, పిల్లలు, మహిళలు బరిసెలు, గొడ్డళ్ళు, కత్తులు, కర్రలు, కారంపొడి, రాళ్ళతో రెండు గంటలకు పైగా దళితవాడపై స్వైర విహారం చేశారు. మగవారు కొట్టి, కొట్టి అలసిపోయి కూర్చుంటే మహిళలు వారికి విసనకర్రలతో విసిరి, వాటర్ బాటిల్స్‌తో నీరందించి ప్రోత్సహించారు. స్వయంగా మహిళలు కూడా కర్రలతో దాడి చేశారు.

కులం, తక్కువ వాళ్లు దేవాలయాలకు రాకూడదు, హోటల్లో రెండు గ్లాసుల విధానం, క్షౌరం, కట్టింగ్ చేయనివ్వరు. నల్లా నీళ్లు తీసుకోనివ్వరు. దళిత మహిళ సర్పంచ్, ఆమె భర్త గ్రామ పంచాయతీలో కింద కూర్చోవాలి. మాల నా కొడుకులకు, కూలీనా కొడుకులకు భూములు కావాలా? సర్పంచులౌతారా? మాకే ఎదురు తిరుగుతారా? అని నానా దుర్భాషలాడుతూ హత్యాకాండకు తెగడ్డారు. కులం తక్కువ వాళ్లు కూలీలుగా ఉండాలి, భూములు అడగకూడదు. భూములు ఆక్రమించుకున్నా ఊరుకుండాలి. తమకు నచ్చిన పార్టీలోనే ఉండాలి. తమకు అణిగిమణిగి మాత్రమే ఉండాలి. అగ్రకుల పెత్తందార్లకు ఎదురు తిరగకూడదు. ప్రశ్నిస్తే దాడులు చేస్తాం. కాళ్ళూ, చేతులూ విరగ్గొడతాం. హత్యలు చేస్తామన్నది వారి వైఖరి.

శ్రీకాకుళం జిల్లా వంగర మండలంలోని 12 గ్రామాల్లోని ప్రభుత్వ, రైతుల భూములు 7,779 ఎకరాలు మడ్డువలస ప్రాజెక్టు కోసం ప్రభుత్వం సేకరించింది. అందులో భాగంగా లక్షింపేట గ్రామమంతా నిర్వాసిత గ్రామమైంది. గ్రామంలో 75 దళిత, 75 తూర్పుకాపుల, 11 ఇతర బిసి కులాల కుటుంబాలున్నాయి. ఇంటి స్థోమతను బట్టి పెత్తందార్ల ఇంటికి లక్ష రూపాయల చొప్పున, దళితలవి పూరి గుడెసెలే కాబట్టి రూ. 3 వేల నుంచి రూ. 12 వేల లోపు ప్రభుత్వం నష్ట పరిహారం చెల్లించి గ్రామాన్ని ఖాళీ చేయించింది. పై భాగాన ఉన్న ముత్యాలమ్మ చెరువు దగ్గర ఇళ్ళ స్థలాలు ఇచ్చి ఎస్సీలు, కాపులకు పక్క పక్కనే పునరావాసం కల్పించింది. భూములు కోల్పోయిన రైతులకు ప్రభుత్వం నష్టపరిహారం చెల్లించింది. దళితులు భూములే లేని కూలీలైనందున వీరికి ఎలాంటి నష్ట పరిహారం ఇవ్వలేదు.

ప్రస్తుతం ఉన్న లక్షింపేట గ్రామానికి పరిసరాల్లోనే

ముంపుకు గురికాని 250 ఎకరాలు ఇరిగేషన్ పరిధిలో ప్రభుత్వ భూమి ఉంది. ఈ భూమితో లక్ష్మింపేట రైతులకు ఎలాంటి సంబంధం లేదు. అది ఇతర గ్రామాలకు చెందిన రైతులది. వారికి ప్రభుత్వం నష్టపరిహారం చెల్లించింది. వారంతా వేరే గ్రామాల్లో ఉంటున్నారు. ఈ మొత్తం భూమిని గతంలో హక్కుదారులైన రైతుల నుంచి కౌలుకు తీసుకుని లక్ష్మింపేట తూర్పుకాపులు సాగుచేశారు. కొన్ని సంవత్సరాల తర్వాత అవి ప్రభుత్వ భూములైనందున కౌలు ఇవ్వకుండానే సాగు చేసుకుంటున్నారు. అందులో 60 ఎకరాల భూమికి గతంలో హక్కుదారులైన రైతులు సాగుచేసుకోమని దళితులకు కౌలుకిచ్చారు. ఇది సహించలేని గ్రామ పెత్తందార్లు ఆ భూమి కూడా తమకే కావాలని, మాల కొడుకులు, కూలీనా కొడుకులు మీకు కూడా భూములు కావాలా అని అడ్డుకోగా ఆ భూమి బీడు పడింది.

కుల వివక్ష, దళితుల సమస్యలపై వంగర మండలమంతా కెవిపిఎస్ సర్వేలు, సభలు నిర్వహించి పలు గ్రామాల్లో కుల వివక్ష రూపాలపై ప్రతిఘటనోద్యమాలు నిర్వహించింది. లక్ష్మింపేట గ్రామ దళితులంతా సంఘటితమై కెవిపిఎస్ అండతో మళ్ళీ ఆ 60 ఎకరాల భూమిని దున్ని సాగుచేయడం జరిగింది. ఈ సందర్భంగా అడ్డుపడ్డ పెత్తందార్లను దళితులు సంఘటితంగా ప్రతిఘటించారు. కెవిపిఎస్ మండల కార్యదర్శి గణపతితో సహా ఇరువర్గాలపై 55+54 మందిపై 2011లో బైండోవర్ కేసు పెట్టారు. పోలీసు పికెట్ కూడా ఆరు నెలలు కొనసాగింది. ఆర్డీవో జోక్యం చేసుకుని 60 ఎకరాలు దళితులు సాగు చేసుకునేందుకు అనధికారికంగా నిర్ణయించారు. దళితులు భూమి సాగు చేసుకోవడం సహించలేక ఆ భూమిని కూడా కబ్జా చేయాలని వంగరలోని కాపు నాయకుడు, బొత్స సత్యనారాయణ అనుచరుడు, భూస్వామి, అక్రమంగా కోట్లు సంపాదించిన మాజీ జడ్‌పిటిసి, కాంగ్రెస్ పార్టీ మండల నాయకుడు, ఏ పార్టీ అధికారంలో ఉంటే ఆ పార్టీలోకి మారే బొత్స వాసుదేవనాయుడును సంప్రదించారు. ఆ నియోజకవర్గానికి కొండ్రు మురళి ఎమ్మెల్యే, మంత్రి అయినా ఆ మండలంలో బొత్స వాసుదేవనాయుడిదే పెత్తనం. గ్రామాల్లో పోలీసు స్టేషన్లు, తహశీల్దారు కార్యాలయాల్లో ఆయన చెప్పిందే వేదం.

లక్ష్మింపేట గ్రామంలో దళితులు భూములు సాగుచేసుకుంటే మిగతా 12 గ్రామాల్లోని దళితులు, పేదలు కూడా ఇలాగే ఉద్యమించే అవకాశముందని, మొగ్గలోనే తుంచేయాలని భావించిన బొత్స వాసునాయుడు ఆరు నెలల క్రితం గ్రామంలోని పోలీస్ పికెట్ ఎత్తివేయించాడు. ఆ మరునాడే కాపు పెత్తందార్లతో దళితులపై దాడి చేయించాడు. ఆ దాడిలో చిత్రి అప్పుడు కాళ్లు విరిగాయి. కామేష్‌కు తలపగిలింది. కెవిపిఎస్ నిర్వహించిన ఆందోళన ఫలితంగా నిందితులపై ఎస్సీ, ఎస్టీ అట్రాసిటీ కేసు నమోదు చేయించి అరెస్టు చేయించినా మూడు రోజుల్లోనే బెయిల్ ఇచ్చి కోర్టు కూడా అగ్రకుల పెత్తందార్లకు అండగా నిలిచింది. ఈ దాడి తర్వాత రెండవసారి పోలీసు పికెట్ ఏర్పాటు చేశారు. అధికారులు జోక్యం చేసుకుని ఈ భూమి ఎవరూ సాగుచేయరాదని ఆదేశించారు. ఈ నిర్ణయం ఘర్షణను మరింత తీవ్రతరం చేయడానికి ఉపయోగపడింది. దళితులు మంత్రి కొండ్రు మురళిని కలిసి ఎన్నిసార్లు విజ్ఞప్తి చేసినా చెవిటివాని ముందు శంఖం ఊదిన చందమే అయింది. బొత్స వాసుదేవనాయుడు దళితులను పిలిపించి భూములు వదులు కోవాలని హెచ్చరించాడు. దళితులు భూమి కావాలన్నందుకు ఇద్దరు, ముగ్గురు చస్తే గానీ మీరు భూమి వదలరని భయపెట్టాడు. వీరికి అండగా ఉన్న కెవిపిఎస్ స్థానిక నాయకుణ్ణి కూడా భయపెట్టే ప్రయత్నం చేశాడు.

దీనికి తోడు ఇటీవల రాష్ట్రంలో జరిగిన రాజకీయ పరిణామాల ప్రభావం కూడా ఉంది. ఆ మండలంలో కాంగ్రెస్ పార్టీలోని దళితులు, కాపులు ఎక్కువ మంది వైఎస్ఆర్ పార్టీ వైపు వెళ్ళారు. లక్ష్మింపేటలోనూ అదే జరిగింది. దీంతో ఆ మండలంలోని బొత్స వాసునాయుడు రాజకీయ ఆధిపత్యానికి గండి పడింది. కాపుల్లో తన పట్టు నిలుపుకునేందుకు లక్ష్మింపేట కాపులను, దళితులు సాగు చేసే 60 ఎకరాలకు గతంలో హక్కుదారులైన ఇతర గ్రామాల కాపు రైతులను ఐక్యం చేశాడు. హత్యాకాండకు పథకం రూపొందించాడు. దీనికి కావలసిన నిధులను ముందే పోగుచేశాడు. దళితులను భూమి నుంచి ఖాళీ చేయించిన తర్వాత ఎకరాలకు రూ. 80 వేల, చొప్పు గత హక్కుదారులైన కాపులకు లక్ష్మింపేట కాపులు ఇచ్చే విధంగా ఒప్పందం కుదుర్చుకున్నారు. అందుకనుగుణంగానే పోలీసులతో రాయబారాలు నడిపారు.

వధకం అమలుకు సరైన సమయంగా ఉప ఎన్నికలను ఉపయోగించుకున్నారు. ఎన్నికల బందోబస్తు పేరుతో వాసునాయుడు రెండవసారి పికెట్ ఎత్తివేయించాడు. కాపులు, దళితులు సమానమైన బలం అయినందుకు గతంలో హక్కుదారులైన కాపు రైతుల గుంపును రహస్యంగా అదే రోజు గ్రామానికి రప్పించుకున్నాడు. ఉదయాన్నే 7.30 గంటలకు పెత్తందార్లు మూకుమ్మడిగా బాంబులు, గొడ్డళ్ళు, కత్తులు, బరిసెలు, కర్రలతో అన్ని వైపుల నుంచి ఒక్కసారిగా మెరుపు దాడి చేశారు. రెండున్నర గంటల సేపు దళితులతో రక్తకేళి ఆడుకున్నారు. దళితులు తేరుకునే లోగా అక్కడ రక్తం ఏరులై పారింది. భార్యలు చూస్తుండగానే భర్తలు రక్తపు మడుగులో శవాలయ్యారు. 5 కిమీ దూరంలో ఉన్న పోలీసు స్టేషనుకు రక్షణ కల్పించమని ఫోన్లు చేయగా రెండు గంటల తర్వాత ఒక కానిస్టేబుల్ వచ్చి అక్కడ కొనసాగుతున్న మరణకాండను చూసి వెనక్కు పరుగులు పెట్టాడు. ఘటన జరిగిన మూడు గంటల తర్వాత నిందితులంతా ప్రశాంతంగా తప్పించుకున్నాక పోలీసుల సైరన్ మోతలు వినిపించాయి. ముగ్గురు దళితులు అక్కడికక్కడే మరణించారు. ఒకరు ఆస్పత్రికి తరలిస్తుండగానే చనిపోయారు. మరొకరు హాస్పటల్‌లో ప్రాణాలొదిలాడు. 18 మంది నేటికీ గాయాలతో హాస్పిటల్‌లోనే ఉన్నారు.

వాస్తవాలు ఇలా ఉండగా కొందరు నాయకులు, కొన్ని పత్రికలు, మీడియా దీనిని ఇరు వర్గాల మధ్య ఘర్షణగా చిత్రించే ప్రయత్నం చేశారు. ఇది ఏక పక్ష దాడని దళితులు, దళిత సంఘాల నాయకులు మొత్తుకున్నా వారి చెవిన పడలేదు. కెవిపిఎస్, అన్ని దళిత, ప్రజా సంఘాల ఆధ్వర్యంలో శవాలను తీసుకెళ్లకుండా అడ్డుకుని

**వాస్తవాలు ఇలా ఉండగా కొందరు నాయకులు, కొన్ని పత్రికలు, మీడియా దీనిని ఇరు వర్గాల మధ్య ఘర్షణగా చిత్రించే ప్రయత్నం చేశారు. ఇది ఏక పక్ష దాడని దళితులు, దళిత సంఘాల నాయకులు మొత్తుకున్నా వారి చెవిన పడలేదు. కెవిపిఎస్, అన్ని దళిత, ప్రజా సంఘాల ఆధ్వర్యంలో శవాలను తీసుకెళ్లకుండా అడ్డుకుని ఆందోళన నిర్వహించారు.**

కవిత

# దేహ సముద్రాలపై

-ఎస్. బాలసుధాకర్ మౌళి
9676493680



లక్షింపేట..
నెత్తుటి కన్నీరు పెడుతుంది

రాజ్యం వలలో పడి
చిక్కి శల్యమౌతున్న
నిర్వాసిత గ్రామంగా ఒకవైపు
కుల దురహంకార
కత్తుల దాహానికి
బలైన
'నిండు చూలాలు తీరుగా' ఒకవైపు
రెండు కళ్లనూ ధ్వంసిస్తున్న
రాక్షస చర్యకు
కళ్ల నెత్తురు బెట్టుకుని
కనలి కనలి ఏడుస్తోంది

చరిత్ర దుఃఖపర్వపు రాచపుండు
మళ్లీ తిరగబెట్టేసరికి
గతపు 'గాయాల వనం'లో
రాలిన నెత్తుటాకై
నిలువునా దహించుకుపోతుంది

బతుకుల్లో యింత వెలుగు నింపాల్సిన
తూరుపు తొలిపొద్దే..
ఇంటి ఇల్లాలి నుదుటపైన
వాడిన కుంకుమరేకై
గాజుల గలగలలను
గుండె శోకంగా వినిపిస్తుంటే
తల్లి.. ఎంతైనా 'కన్నపేగు బంధం' కదా
దిగులు బండపై తల మోదుకుంటూంది

లక్షింపేటా.. లక్షింపేటా..
నీ గుండె సమాధులపై
ఆరిన నెత్తుటి దీపాల సాక్షిగా

భూమి కోసం
భుక్తి కోసం
శ్రమ గీతాల సారంచేసే
'పంచమ కోయిలల'
తెగిన 'దేహ సముద్రాల'పై
రేపటి ఎర్ర ఉషోదయాల
పెను తుఫాను పోటెత్తుతుంది
అంటరాని వసంతం
ఆకాశం నిండా
ఆకుపచ్చగా పరచుకుంటుంది.

---

ఆందోళన నిర్వహించారు. ముఖ్యమంత్రి వచ్చి సవరించిన జీవో ప్రకారం హత్యకు గురైన వారికి రూ. 5 లక్షలు సబ్‌ప్లాన్ నిధుల నుంచి ఎక్స్‌గ్రేషియా ప్రకటించి వెళ్లిపోయారు. సిపియం రాష్ట్ర కార్యదర్శి బివి రాఘవులు ఘటన జరిగిన గ్రామాన్ని, బాధితులను పరామర్శించి రాజాంలో జాయింట్ కలెక్టర్, ఎఎస్పీలతో చర్చించారు. దళితులపై ఇది ఏకపక్ష దాడి తప్ప ఘర్షణ కాదని, కొందరిపై జరిగిన దాడి కాదని, మొత్తం దళితవాడపై జరిగిన దాడి అని స్పష్టం చేశారు. ఏ భూమి కోసమైతే దళితులు హత్యలకు గురయ్యారో ఆ భూమి దళితులకు ఇవ్వాల్సిన ఆవశ్యకత గురించి నొక్కి చెప్పారు. ఈ మేరకు వెంటనే జీవో జారీ చేయాలని కూడా ఆయన డిమాండ్ చేశారు. బొత్స వాసునాయుడుతోపాటు నిందుతులందరినీ అరెస్టు చేసి కఠినంగా శిక్షించాలని, బాధితులకు ఎస్సీ, ఎస్టీ అత్యాచారాల నిరోధక చట్టంలో ఉన్న సౌకర్యాలన్నీ వెంటనే కల్పించాలన్నారు. దళితులపై దాడి జరిగే అవకాశం ఉందని తెలిసినా పోలీసు పికెట్ ఎత్తివేశారు. రెండు సంవత్సరాల నుంచి ఈ సమస్య రగులుతున్నా దీనిని పరిష్కరించేందుకు ప్రభుత్వం ఎలాంటి చొరవా చూపనందున ఈ హత్యాకాండకు ప్రభుత్వం బాధ్యత వహించాలన్నారు. ఈ డిమాండ్లపైనే దళిత, ప్రజా సంఘాలు వివిధ రూపాల్లో చేసిన ఆందోళనల ఫలితంగా ప్రభుత్వం నీటి ముంపునకు గురికాని మొత్తం భూమి దాదాపు 200 ఎకరాలు దళితులే సాగు చేసుకునేందుకు ఇస్తామని, ప్రతి దళిత కుటుంబానికీ ఒక ఎకరానికి తగ్గకుండా పట్టాభూమి ఇస్తామని, హత్యకు గురైన కుటుంబంలో ఒకరికి ఉద్యోగం, రూ. 5 లక్ష చొప్పున ఎక్స్‌గ్రేషియా, గాయపడిన వారికి ఆర్థిక సహాయం, ఇతర అన్ని సౌకర్యాలూ కల్పిస్తామని కలెక్టర్, ఎస్పీలు హామీ ఇచ్చారు.

**ఏ భూమి కోసమైతే దళితులు హత్యలకు గురయ్యారో ఆ భూమి దళితులకు ఇవ్వాల్సిన ఆవశ్యకత గురించి నొక్కి చెప్పారు. ఈ మేరకు వెంటనే జీవో జారీ చేయాలని కూడా ఆయన డిమాండ్ చేశారు. బొత్స వాసుదేవ నాయుడుతోపాటు నిందుతులందరినీ అరెస్టు చేసి కఠినంగా శిక్షించాలని, బాధితులకు ఎస్సీ, ఎస్టీ అత్యాచారాల నిరోధక చట్టంలో ఉన్న సౌకర్యాలన్నీ వెంటనే కల్పించాలన్నారు.**

ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమిటంటే అధికార పార్టీ ఎస్సీ ఎమ్మెల్యే, మంత్రిగా ప్రాతినిధ్యం వహిస్తున్న నియోజకవర్గంలో అదే పార్టీకి చెందిన పెత్తందార్లు అదే పార్టీ చెందిన దళితులను ఊచకోత కోశారు. అదే పార్టీకి చెందిన రాజకీయ నాయకులే హంతకులను కాపాడుతున్నారు. దళితులను అన్యాయంగా హత్య చేసిన నేరస్థులు కాంగ్రెస్ పార్టీలో ఉండొచ్చా? లేకుంటే వారిపై పార్టీపరంగా చర్యలు ఎందుకు తీసుకోలేదు. అలాంటప్పుడు దళితులు ఎందుకు ఆ పార్టీలో ఉండాలి? దళితుల హక్కుల పట్ల చిత్తశుద్ధి లేని ఏ పార్టీ ఇక మనుగడ సాగించలేదు. కారంచేడులో నీళ్ళ కోసం, చుండూరులో ఆత్మగౌరవం కోసం, లక్షింపేటలో భూమి కోసం దళితులు రక్త తర్పణ చేశారు. ఆత్మగౌరవం, భూమి, సమానత్వం, హక్కులన్నీ అమలు చేసుకోవాలంటే అన్ని పార్టీల్లో ఉన్న దళితులు, సంఘాలు ఐక్యం కావాలి. కలిసి వచ్చే వ్యక్తులు, శక్తులు, అభ్యుదయవాదులు, కమ్యూనిస్టులతో ఐక్య సంఘటనగా ఉద్యమిస్తే అంతిమ విజయం సాధిస్తాం.

**రచయిత సెల్ :9490098058**

**(రచయిత కెవిపిఎస్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)**

# గుడ్లమ్మేవాడు

- బి.ఎ. నరసింహులు

గట్టిగా అరుస్తూ
గుడ్లమ్ముతూ
ఆ వూరి వీధుల్లో
తిరుగుతాడు ఆ
గుడ్లమ్మేవాడు
ఆ అరుపు
ఆ అమ్మకం
ఆతడి ఆకలి 'కేక'లో
ప్రతిధ్వనిస్తుంది
ఎన్నో ఏళ్ళుగా
నా కెరుకే వాడి గొంతు
బిగ్గరగా వేసే కేక
మారుమూల ఇళ్ళలో
గదుల్లోకి వాయు తరంగాలపై
సాగే ఆ అమ్మకపు కేక
వాడి కమిషన్ ఆదాయంలో



ఆ రోజుకి పూటగడిచే
బతుకు ఆటలో
ప్రతిఫలిస్తుంది
వాడి బతుకు గమ్యానికి
ఒక ఆశయంగా
నిలుస్తుంది తనతో పాటే
వీథ్కోలు తిరుగుతూ
కొనుగోలుదార్ల చెవుల్లో
మార్మోగుతుంది
వాడు వీధి చివర
మలుపులోకి దాటేవరకు
ఒక్కోసారి వీధిలోని
గిరాకీ జీరోస్థాయికి
పడిపోతే వాడి గొంతు
పెరుగుతుంది ఆశగా ఆత్రంగా
వాడి కేకతోనే ఉలిక్కిపడి
ఆలోచనల్లో పడిపోతాను
ఎవరికెవరు జవాబుదారో
తెలియని (అ)ప్రజాస్వామ్య వ్యవస్థలో
ధనిక పేద తారతమ్యాల అంతరం
మరింత విస్తృతమౌతూ
కొందరసలు అరవకనే ప్రాణ
త్యాగాలు చేసుకునే దౌర్భాగ్యం
ఎక్కడో లోపభూయిష్టమైన
పాలన సాగుతుందనే బాధ మదిని
తట్టి లేపుతుందా 'కేక' అది నేను
విన్నప్పుడల్లా ఆ గుడ్లమ్మేవాడు నా
ఇంటి గుమ్మం దాటుతుంటాడు

# రెక్కలు

- గోపాలుని వెంకటేశ్వర్లు
సెల్ : 9247234991

మొండి గోడల
హృదయ మందిరంలో
అపస్వరాలు
వినిపిస్తూ విషాద రాగాలు -

జీవితం
తీగెలు తెగిన వీణ

ఎంత గడించినా
మన కోసం రెండు కన్నీటి బొట్లు
రాల్చేవారిని
సంపాదించుకోవాల్సిందే -

మరణం జీవితానికి
కొనసాగింపే

ఎన్నాళ్ళుగానో
ఎన్నేళ్ళుగానో
ఎంత ప్రయాణించినా
గమ్యం చేరుకోకపోవచ్చు -

జీవితం
రెక్కలు తెగిన పక్షి

గుప్పెడు మనసులో
పడగలెత్తే
కోరికలు ఎన్నో
ఎన్నెన్నో -

చివరకు మిగిలేది
గుప్పెడు బూడిద



తూనీగల వెంట
పరుగులు తీయడం
చింతపూల బజ్జీ రుచులు
కోతికొమ్మంచి ఆటలు -

బాల్య స్మృతులు
సజీవ దృశ్య కావ్యాలు

ఎదుటి వారి
ప్రేమ కొరకు
ఎంత తపించి
పోతుంటామో-

ఎడారిలో వర్షపు చినుకులు
ఏపాటి?

ఒక సమస్యను
వదిలించుకుంటే
మరో సమస్య
రెడీగా ఉండొచ్చు -

దూసుకు వచ్చే ఆయుధం
కాలం!

గుండె కవాటాలన్నీ
కొలెస్టరాల్ చెత్తతో
పూడుకు
పోతున్నాయ్ -

దయలేనిది
జిహ్వా చాపల్యం

# నానీలు



- లక్కరాజు నిర్మల
సెల్ : 9949299618

ఏ విత్తు వేస్తే
ఆ పంట
ఆలోచనను బట్టే
ఆచరణ మరి

కలుపు మొక్క
ఏపుగా పెరుగుతుంది
వేసిన ఎరువేమో
మొక్కకి కరువు

సంఘాన్ని
మార్చాలంటావా?
అయితే ముందు
నీతో మొదలుపెట్టు

అవసరానికి
పనికి రాకపోతే
రత్నాలు కూడా
రాళ్ళతో సమానం

మాటకు మాట
తూటాలా పేల్చావు
మౌనాన్ని
ప్రదర్శించి చూడు

# సామాజిక స్ఫూర్తి నింపిన జనకవనం



సిఐటియు మహాసభలను పురస్కరించుకుని హైదరాబాద్‌లో సుందరయ్య విజ్ఞానకేంద్రంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జరిగిన జనకవనం. చిత్రంలో నిఖిలేశ్వర్, కె. శివారెడ్డి, తెలకపల్లి రవి, ఆర్. సుధాభాస్కర్, యాకూబ్, యస్.వి. సత్యనారాయణ

సిఐటియు రాష్ట్ర మహాసభల సందర్భంగా జూలై 1న సాహితీస్రవంతి ఆధ్వర్యంలో హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో జనకవనం జరిగింది. 2002లో హైదరాబాద్‌లో సుందరయ్య విజ్ఞానకేంద్రంలో సాహితీస్రవంతి నిర్వహించిన తొలి 'జనకవనం' విశేష ప్రచారం పొందింది. సరిగ్గా పది సంవత్సరాలు పూర్తిచేసుకున్నందున దీనిని 'దశాబ్ది జనకవనం'గా నిర్వహించడం జరిగింది. ప్రపంచవ్యాప్తంగా ఈ పదేళ్ళలో అనేక మార్పులు చోటుచేసుకున్నాయి. ఇరవై ఏళ్ళ కిందట మన దేశంలో ప్రారంభమైన ప్రపంచీకరణ విధానాల దుష్ఫలితాలు ఈ కాలంలో తీవ్రరూపంలో బహిర్గతమవుతున్నాయి. అంతర్జాతీయంగా పెట్టుబడిదారీ విధానం సంక్షోభంలో కూరుకుపోతూ ప్రజలపై మరింత కఠినమైన భారాల్ని వేస్తున్నది. పేద, మధ్య తరగతి ప్రజలు, కార్మిక, శ్రామికవర్గ ప్రజలలో ఈ విధానాల పట్ల రోజురోజుకూ వ్యతిరేకత పెరుగుతుంది. అమెరికా వాల్‌స్ట్రీట్ ఆందోళనలు, పశ్చిమాసియా ప్రజాగ్రహాలు, ఐరోపా దేశాల సంక్షోభాలు దీనిని రుజువు చేస్తున్నాయి. ఈ నేపథ్యంలో కార్మికవర్గ చైతన్యం కోసం కృషిచేస్తున్న సి.ఐ.టి.యు. రాష్ట్ర మహాసభలు జరిగాయి. సాంస్కృతిక రంగం ప్రాధాన్యత రీత్యా పలు కార్యక్రమాలను సిఐటియు వివిధ ప్రజా సంఘాలతో కలిసి రూపొందించింది. ఈ క్రమంలో హైదరాబాద్‌లో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో 'దశాబ్ది జనకవనం' ఉత్సాహభరితంగా జరిగింది.

ప్రముఖ కవి శివారెడ్డి ఈ జనకవనాన్ని ప్రారంభించారు. తొలి జనకవనాన్ని తనే ప్రారంభించిన విషయాన్ని గుర్తుచేసుకుని సాహితీస్రవంతి లాంటి వేదికల ప్రాధాన్యతను అర్థం చేసుకోవాలన్నారు. చీలికలు, పీలికలు అవుతున్న ప్రజాసమూహాల ఐక్యత ప్రాధాన్యతను అందరూ గుర్తించాలని కోరారు. సాహితీస్రవంతి రాష్ట్ర వ్యాప్తంగా అనేక ప్రాంతాలలో చేస్తున్న సాహిత్యకృషిని అభినందించారు. ఈ సభలో సిఐటియు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఆర్. సుధాభాస్కర్, ప్రముఖ కవులు నిఖిలేశ్వర్, యస్వీ. సత్యనారాయణ, యాకూబ్‌లు తమ సందేశాలు ఇచ్చారు. ప్రారంభ సభకు సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అధ్యక్షత వహించారు. అనంతరం సాహితీస్రవంతి బాధ్యులు వల్లభాపురం జనార్దన, వీరప్రసాద్, జంధ్యాల రఘుబాబు, స్ఫూర్తి, భూపతి వెంకటేశ్వర్లు జనకవనాన్ని నిర్వహించారు.

హైదరాబాద్, రంగారెడ్డి, కర్నూలు, నల్గొండ, మహబూబ్‌నగర్, వరంగల్, నిజామాబాద్ తదితర ప్రాంతాల నుండి కవులు ఇందులో పాల్గొన్నారు. నలభై మంది తమ స్వీయ కవితలు వినిపించారు. అధికభాగం కవితలు శ్రమ గురించి, కష్టజీవుల గురించి, కార్మికుల గురించి రాసినవే అయినప్పటికీ రైతు ఆత్మహత్యల మీద, ప్రపంచీకరణకు వ్యతిరేకంగా, సామ్రాజ్యవాద ఆధిపత్య ధోరణులను నిరసిస్తూ మంచి కవితలు చదివారు. లోపభూయిష్టంగా సాగుతున్న వ్యవస్థను మార్చాలన్న ఆకాంక్ష అంతర్లీనంగా కవితల నిండా పరుచుకుంది. వర్తమాన సమాజం ఎదుర్కొంటున్న పలు సమస్యలపై సంధించిన కవితా బాణాలు సభలో పాల్గొన్నవారిని ఆకట్టుకున్నాయి.

ప్రపంచీకరణ విధానాలు పేరుతో దేశీయ సంస్కృతి, భాషలపై విచక్షణా రహితంగా జరుగుతున్న దాడులను పేర్కొంటూ "సంస్కృతిని చంపుతున్నా, భాషను ఈసడిస్తున్నా/ తిండిని, వేషాన్ని వెక్కిరిస్తున్నా/దేశీయ సార్వభౌమాధికారం/ ఉలకటం లేదు. పలకటం లేదు"– అంటూ కవిత్వీకరించాడు సీనియర్ కవి వల్లభాపురం జనార్దన. (సంకెళ్ళు తెగిపడే చప్పుడు కోసం). మరో కవి ఇదే అంశాన్ని క్లుప్తమైన పదాలతో కవిత్వం చేస్తూ– "ప్రజలను భ్రమలలో ముంచి/మనసుపై దాడిచేసి, భావజాలాన్నే/మార్చే కుట్ర ప్రపంచీకరణ" అని నిర్వచిస్తాడు– ('గరళీకరణ – ఆవుల బసప్ప).

ప్రజలకు మేలు చేస్తాయనే పేరుతో అమలు పరిచిన ఈ విధానాల అసలు స్వరూపాన్ని కవులు నిర్మోహమాటంగా వెల్లడి చేసారు తమ కవితల్లో. 'పంట పొలాల్లో/ పరిశ్రమల్లో/ విద్యాలయాల్లో/ వైద్యాలయాల్లో/ ఒక్కటేమిటి/ ఎక్కడ వీలైతే అక్కడ/ ఎగబడి/ తెగబడి/

విషపు కోరలు చాచుకుంటూ/ ప్రపంచీకరణ ఫ్లూ ప్రబలిపోతోంది" అంటూ ప్రపంచీకరణ ఆక్టోపస్ స్వరూపాన్ని కళ్ళకు కట్టారు కవయిత్రి శాంతిశ్రీ. ప్రపంచీకరణ ఎన్ని రూపాల్లో సమాజంలో ప్రవేశించిందో తమ కవిత్వం ద్వారా వెల్లడించారు కవులు- "ఊరంటే... ఇప్పుడు/ ఆరుద్ర పురుగుల ఆనవాళ్లు లేని ఆవాసం.../ విసిరేసిన ఎంగిలి విస్తరి/ అమావాస్య చీకటి అంధకారం/అంపశయ్యపై పడుకున్న ఆర్తనాదం/ ఆరు దశాబ్దాల మేడిపండు"- అని శక్తివంతంగా అక్షరాలను అల్లాడు మెదక్ జిల్లా నర్సాపూర్ నుండి వచ్చిన కవి వలన్‌దాస్ వెంకటేష్- (ఆకురాలిన మహావృక్షం). మన స్వాతంత్ర్యాన్ని మరో కోణంలో ప్రశ్నించాడు యం.జి. వంశీకృష్ణ - "ఆకలి దప్పికలతో ఆత్మహత్య జరుగుచోట/ నిరుద్యోగ సమస్యతో అనునిత్యం నలుగుచోట/ ఆత్మగౌరవం లేని వ్యర్థ బ్రతుకు బ్రతుకు చోట/ ఓ సామాన్యుడిగా చెబుతున్నా నా కొద్దీ స్వాతంత్ర్యం' అంటాడు -('నా కొద్దీ స్వాతంత్ర్యం)

వ్యవసాయ ప్రధాన దేశంలో స్వాతంత్ర్య అనంతర సుదీర్ఘ కాలంలో రైతులు ఆత్మహత్యలు చేసుకోవడాన్ని కవి ప్రశ్నించకుండా ఉండలేడు- "బక్కపల్చని రైతుకి/ ఆత్మహత్యే శరణ్యమయిపాయె/ ప్రభుత్వం అన్నార్తుల ఆకలి తీర్చే రైతన్నకు/ అండగా నిలిస్తే/ అతని మనుగడ సులభతరం/రైతే రాజన్నది అప్పుడే నగ్నసత్యం" రైతు పరిస్థితిపై వేదన ఈ కవిత వ్యక్తం చేస్తుంది- ('రాజు - పడాల బ్రహ్మచారి"). కార్మికుల జనకవనం కావడాన కష్టజీవుల శ్రమకూ, స్వేదానికి గౌరవం కల్పించే కవితలు చాలానే ఉన్నాయి. - "నీ స్వేదం నాకు కావాలి/ నేను కవిగా మారటానికి/ అలా మనుగడ సాగించటానికి/ అసలు నా జీవితానికే/ ఓ చుక్కాని అది" అని స్వేదాన్ని కవిత్వం చేసాడు జంధ్యాల రఘుబాబు (నీ స్వేదం). స్వేదం చిందించకుండా ఏ ఉత్పత్తీ సాధ్యం కాదు. ఆ స్వేదం చిందించే అశేష కార్మిక వర్గ కనీస అవసరాలు తీర్చలేని వ్యవస్థను మార్చాలన్న కవులు ప్రతిన ఈ కవితల నిండా కనిపిస్తుంది. అస్తవ్యస్త వ్యవస్థలో అవినీతి నీతిగా ఎలా చలామణి అవుతుందో పొత్తూరి సుబ్బారావు వ్యంగ్యంగా సెలవిస్తున్నాడు- "కటకటాలలో వుంచినా/ కల్లా కపటమెరగనిదంటూ/ కళ్లకద్దుకుంటున్నారు/ బయటకెపుడొస్తుందోనని/ కళ్లారా ఎదురుచూస్తున్నారు"- (ఈ రోజులో). కవులు కలం పదునును చాటడంలో ఉత్సాహం చూపించడం కద్దు. ఈ కవి చూడండి- "కత్తిది మొత్తం రక్త చరిత్ర/ కలం సిరాతో రాస్తే కొత్త చరిత్ర" - (కలం - నడిమింటి లక్ష్మీనారాయణ). ఈ కవి చదివిన తీరు జనకవనం సభను ఆకట్టుకుంది. కార్మికుల కష్టంతో ఉత్పత్తి పెంచుకునే పెట్టుబడిదారులు వారికి మిగిల్చేదేమిటో కర్లపాలెం భాస్కరరావు ఇలా వ్యక్తీకరిస్తున్నాడు- "పెట్టుబడిదారీ వర్గం గర్భస్రావాలు/ మురికి వాడలు, ఛాయా బ్రతుకులు" -(దుందుభి). పెట్టుబడిదారీ వ్యవస్థ సృష్టించిన మురికి వాడలను ఈ కవి ఆ వ్యవస్థ గర్భస్రావాలుగా పోల్చి నిరసిస్తున్నాడు.

వినూత్న అభివ్యక్తి కోసం కవులు చేస్తున్న ప్రయత్నం ఈ జనకవనంలో కనబడింది. పలు కవితలు శక్తివంతమైన వ్యక్తీకరణతో సాగటం సంతోషం కలిగించింది. కవులు కేవలం వస్తువు మీదనే దృష్టి కేంద్రీకరించకుండా రూపంపై కూడా శ్రద్ధ పెట్టడానికి చేసిన ప్రయత్నం ఈ కవితలలో మనం గమనించగలం. ఔత్సాహిక కవుల కవితా సాధన కూడా ఈ జనకవనంలో ప్రతిబింబించింది. - "నా కలం నన్ను తట్టి లేపింది/ కాలే కడుపులతో బ్రతుకీడుస్తున్న/ ప్రజల పక్షం నిలవమన్నది/ శ్రమజీవి సృష్టించిన సంపద/ ఏ కొందరికో చెందడాన్ని / ప్రశ్నించమంటున్నది"- (నాకలం- టి. కిషోర్) కవి తన కలాన్ని ఎవరి పక్షం నిలపాలో కూడా నిర్ణయించుకుంటున్నాడు. ఆ స్పష్టత ఈనాటి కవులకు అవశ్యం. మరో ఔత్సాహిక కవయిత్రి నాగశిరీష - నాగరికత పేరిట యువత పెడదారి పట్టడం, శ్రమ విలువ తెలియకుండా పోవడాన్ని కవిత్వం చేసింది- "నాగరికత పేరుతో/ విలాసాల మోజుతో/ వివేచన కరువై/ సభ్యతే మరుగై/ మందుచుక్క తప్పు/ చెమట చుక్క విలువెరగక/ పురోగమనమనుకుంటూ/ తిరోగమన దారిపట్టి/ అదిగదిగో మన యువత ఎటుపోతుందో"/ వాని భవిత" ('నాడు-నేడు)

వివిధ ప్రాంతాల నుండి వచ్చిన కవులు విభిన్న వస్తువులను తీసుకుని చక్కటి కవిత్వాన్ని పండించారు. ప్రతీ కవితలో కూడా శక్తివంతమైన చరణాలు ఆకట్టుకున్నాయి. "కదను తొక్కుతున్న కార్మికసైన్యం/ సమతా దీపావళి కోసం/ ఉద్యమ దిక్సూచిగా మారి/ పోరుబాట నడుస్తుంది/ (అంతిమ విజయం కార్మిక శక్తిదే - యం.డి. ఖాజామైనద్దీన్)

అవినీతిపరులు నిర్భీతిగా సమాజంలో చలామణి కావడం కవయిత్రి కె.ఎ.ఎల్. సత్యవతికి ఆగ్రహం తెప్పించింది- "నిలువుదోపిడీ చేయబద్ధ అతడు/ సిగ్గుతో తలవంచుకునే వుంటాడు/ దోపిడీ దొంగలు దొరలై../ మీసాలను మెలిపెడుతూ/ దర్జా వెలగబెడుతున్నారు" - (ఇక మూడో నేత్రం తెరవాలి). ఇదే అంశంపై మరో కవి జి. నరసింహమూర్తి - "కలాల్ని అలంకారంగా భుజాన/ మోసేందుకు సిగ్గేస్తుంది/ కోరలు చాచిన అవినీతిపై/ గన్నై పేలే రోజొచ్చింది" అంటూ స్పందించారు తన (మానవ బాంబు) కవితలో.

సమాజంలో వస్తున్న మార్పులను కవి పట్టుకుంటున్న తీరు విస్మయపరుస్తుంది. మనుషుల మధ్య సంబంధాలలో వస్తున్న ధోరణులను చెప్తూ జంకె కృష్ణారెడ్డి 'ఎక్కడో లెక్క తప్పింది' అంటున్నాడు- "బంధుగణం పెరుగుతున్నా/ ఆత్మ బంధువులు అదృశ్యమౌతున్నారు/ "(ఎక్కడో లెక్కతప్పింది). ప్రేమలూ, అనురాగాలూ విపరీత ధోరణులకు గురికావడం కవి దృష్టిని దాటిపోలేదు. అదే రీతిలో మరో కవి కూడా స్పందిస్తున్నాడు - 'మరుగున పడ్డ మమతానురాగాలు/ అసహజ కపట ప్రేమలు/ ప్రేమోన్మాద దాడులు/ కన్నవారి కోసం మిగలదు ఒక్క క్షణం/ విలాస వినోదాలకు పుష్కలం/ అవినీతి పరుగుల పయనం/ జన సామాన్యుని బతుకు ఛిద్రం"- (మహానగర మనోవ్యధ - ఎం.పి. రమేశ్ బాబు).

సామ్రాజ్యవాద ఆధిపత్య ధోరణి తెగనాడుతూ దాని స్వభావాన్ని కవి గేరా తేటతెల్లం చేస్తున్నాడు- "వాడిది/ తేనెటీగల్లో తేడాలు తీసుకొచ్చి/ పట్టు తేనెను జుర్రుకొనే/ ఎలుంగొడ్డు ఎత్తుగడ!/ చలిచీమల్లో చీలికలు సృష్టించి/ పుట్టల్లో పాగావేసే/ మిన్నాగుల పన్నాగం!"- ""(కాంతి కావ్యం ).. మరో కవి భూపతి వెంకటేశ్వర్లు

# మన సంపద



అక్కడ తలుపులు తీయగానే
ఒక విభ్రమ !
తలకు చుట్టిన పాగా చంద్రునిలా,
నల్లని శరీరం రేగడి భూమిలా,
మొలకున్న చిన్న పంచె మావూరి కుంటలా,
బరిబాత పాదాలు కుంటలో మొలిచిన తుమ్మల్లా
టస్సాడ్ మ్యూజియంలో విలువైన
సంపద మన రైతు !!
కళ్ళు మాత్రం ఆశ కోల్పోని ఆత్మలా
వ్యసన చరిత్రని పునరావృత్తం చేసేలా
నడిరేయి ఘడియలను లెక్క పెట్టుకుంటూ
మళ్ళీ మళ్ళీ వ్యవసాయం చేద్దామనే!
తెల్లవారక ముందే ఆకళ్ళను చద్ది గిన్నెల్లో సర్దుకొని
దేహాలను భుజంమ్మీది కెత్తుకొని
వలసవాదం ఊతకర్రగా కూడళ్ళల్లోంచి
పోతూ వుంటే....
ఎర్రని ఎండ ఊరంతా
పొర్లి గింతలు పెడ్తోంది.
గాలిగొంతు పిసుకుతోంటే
ఎండిపోయిన మొదళ్ళు పెట్టే కేకలకు
కరువు గుక్కిళ్ళు మింగుతోంది
బీటలు వారిన నేల
సేద్యగాడు కట్టుకున్న పంచెలా చిరిగింది
మాగాణులు రేగుముల్లులై కాళ్ళల్లో దిగబడుతుంటే
మట్టి మనిషి సెజ్ దెబ్బలకు
బోన్సాయ్ మొక్కైనాడు !
అఖండ భారతావనికి అన్నం పెట్టే వాడల్లా
అడుక్కు తింటానికి కూటి గిన్నెలు
వెతుక్కుంటున్నాడు.

తమ్మెర రాధిక,
సెల్ : 9440626702

# నా కోరిక



ఎ. సరిత

కక్షలూ, కార్పణ్యాలు
హత్యలూ, విచ్చలవిడి దోపిడీలు
మాత్సర్యాలూ, అమానుషాలు
మానవత్వం మసకబారి
మనుషులు ప్రవర్తించే తీరూ
నెత్తురు పీల్చే జలగలను కూడా
విత్తం కోసం పీడించే
వింత మనస్తత్వాలూ
అన్నదమ్ములు ఆస్తులతో పాటు
అమ్మానాన్నలనూ పంచుకోవడాలూ
చూసాక
కల్మషంలేని మనసుతో
కళకళ లాడే నయనాలతో
కుళ్ళు అంటే తెలియని
కల్లా కపటం లేని
చిన్ని పాపనై పోవాలనే
చిన్న కోరిక కలుగుతుంది నాలో

తీవ్ర గొంతుతో తన కవితాస్త్రాన్ని ఎక్కుపెడుతున్నాడు. – "పెట్టుబడిదారుల హైటెక్ కుట్రలపై/ కన్నీటి బాణాన్ని సంధిస్తున్నా/ నేనిప్పుడు బహుళజాతి కోరల్లో/ చిక్కిన బానిసను కాను/ నిరంకుశ నెత్తుటి రాజ్య విస్తరణపై/ ఎక్కుపెట్టిన శ్రామిక చెమట చుక్కను" –('స్వేదం నా ఆయుధం). కవి కెంగారమోహన్"చెమట బిందువులన్నీ, సిరాక్షరాలవుతున్నాయి/ తెల్ల కాగితంపై రాస్తున్న కవితాస్త్రం/ ఉద్యమ వీరుల స్ఫూర్తి/ మనిషిపై పంజా విసిరిన / మాయలోడిపై పోరాటం అనివార్యం' అంటున్నాడు తన 'సోషలిజం' కవితలో. ఈ విధంగా జనకవనంలో చదివిన కవితలన్నీ సామాజిక స్ఫూర్తిని చాటుతూ సాగాయి. కవులు ఉత్తేజంగానూ, ఉద్వేగంగానూ కవితలు చదివారు. తొలి జనకవనం నుండి ఇంచుమించు ప్రతీ జనకవనంకు వచ్చి కవిత చదివిన జనజ్వాల మహబూబ్‌నగర్‌కు చెందిన సీనియర్ కవి. కంటి చికిత్స కారణంగా ఈ జనకవనానికి హాజరు కాలేనంటూ తన కవితా సందేశాన్ని పంపారు. – "పది వసంతాల 'జనకవనం' కి నా జేజేలు/ సుత్తి కొడవలి మీద ఎర్రెర్ర జెండా కవిత్వం కప్పుకొని/ కాలానికి భరోసానిస్తూ, వచ్చే కాలానికి స్వాగతమిస్తూ.../ చరితను పునీతం చేస్తున్న సుత్తి కొడవలి ఎర్రజెండా కలం/ యోధుల గొంతుకకు సమూహ 'కవనానికి' జేజేలు!"/ పదివసంతాలుగా విరామం ఎరగక ప్రయాణిస్తున్న/ సహచర కలం మిత్రులకు శ్రామిక పీడిత అక్షర వనానికి/ సమసమాజ సమర 'జనకవనం' గొంతులకు నా జేజేలు!" – జనజ్వాల" ఈ సందేశం జనకవనాలకి స్ఫూర్తినిస్తుంది. రాష్ట్రమంతటా జనకవనాలు సిఐటియు మహాసభల సందర్భంగా జరిగాయి. వాటిలో అనేక మంది కవులు, కవయిత్రులు పాల్గొని కవితా పఠనం చేసారు. సిఐటియు సహకారంతో వాటిలోని మేలైన కవితలతో కవితా సంకలనం ప్రచురించడానికి ప్రయత్నం జరుగుతుంది. ఈ జనకవనంలో జి. యాదగిరి రావు, తంగిరాల చక్రవర్తి, కందేపి రాజ్యలక్ష్మి, వెంకటి, జి.నరేష్, మల్లవరపు విజయ, ఆచార్య నరేంద్ర, డి. సైదులు తదితరులు తమ కవితలు చదివారు. జనకవన సభకు అతిథులుగా విచ్చేసిన ప్రముఖ కవులు శివారెడ్డి, నిఖిలేశ్వర్, యాకూబ్ స్వీయ కవితలు చదివి సభకు ఉత్తేజం కలిగించారు. ఎస్వీ సత్యనారాయణ, తెలకపల్లి రవి తమ గేయాలను ఆలపించి సభలో ఉత్సాహం నింపారు.

- వీరప్రసాద్




## కవిత 2011

**సంపాదకులు**

**డా॥ పాపినేని శివశంకర్**

**దర్భశయనం శ్రీనివాసాచార్య**

**వెల : 120 పేజీలు : 155**

**ప్రతులకు : 9490634849**

గ్లోబలైజేషన్ క్రమం మొదలైన మలి దశాబ్దంలోని 2004 నుండి ఏ విధంమైన ఆటంకాలు లేకుండా నిర్వహిస్తూ వస్తున్నాం. కవిత్వమై బతికిన క్షణాలను భద్రపరచుకుంటున్నాం. మేం భద్రపరచిన కవిత్వ నిధిని పుస్తకరూపంలో పాఠకుల ముందు పెడుతున్నాం. మే 1న ప్రతి సాయంకాలం కవుల స్వరాల నుండి దూసుకొచ్చే కవిత్వాగ్ని క్షిపణులు ధ్వంసం చేయదగ్గ స్థలాల మీదకు, ఆయా కక్ష్యాంతరాల్లోకి ప్రవేశిస్తున్నప్పుడు మా ప్రయోగం విజయవంతమవుతోందని విధేయంగా చప్పట్లు కొట్టి ఆనందిస్తున్నాం.

**విశ్వేశ్వరరావు**




## శృంఖల

**దుర్గానంద్**

**వెల : రూ.90/- పేజీలు : 122**

**ప్రతులకు : 040-27222370**

'శృంఖల' లోని గేయాలను ఒక బాణీలో పాడుతూ.. రాస్తూ.. రాస్తూ.. పాడుతూ.. వుంటే మాకుటుంబ సభ్యులకు ఒక్కపాటా అర్థం అయ్యేదికాదు. ఒక్కోసారి ఫ్లూట్‌లో కూడా ఈ గేయాలను ఆలపిస్తూ తన్మయం చెందేవారు. కానీ, ఇప్పుడు నలభైయేళ్ళ తర్వాత ఆయన వదిలిపెట్టిన రాతపత్రుల్లో ఆ పాట వినిపిస్తోంది మనసును తడిపేస్తోంది.

**- సి. అంబికానంద్**




## గ్రంథాలయ సమాచార శాస్త్ర వ్యాసాలు

**ఎల్.ఎస్. రామయ్య**

**వెల : రూ.40- పేజీలు : 96**

**ప్రతులకు : 9490193969**

ప్రస్తుత గ్రంథం "గ్రంథాలయ సమాచార శాస్త్ర వ్యాసాలు" సంపుటి 1లో ఆచార్య ఎల్.ఎస్. రామయ్య గారు వ్రాసిన వ్యాసాలు సంకలనం చేయబడినాయి. ఇందులో పదిహేను వ్యాసాలు వున్నాయి. ఈ వ్యాసాలు పౌర గ్రంథాలయాలు, గ్రంథాలయ చట్టం, సహకార గ్రంథసేకరణ పౌర గ్రంథాలయ వ్యవస్థ ఎదుర్కుంటున్న సమస్యలు, శ్రవణ దృశ్య కేంద్రాలు, సమాచార సేవలు మొదలగు అంశాలకు సంబంధించినవి. సరళమైన భాషల్లో, సగటు గణాంకాలతో అందరికి అర్థమైన శైలిలో వ్యాసాలు వ్రాయబడినాయి.

**ఆచార్య ఎ.ఎ.ఎన్. రాజు**




## బౌద్ధం - సాంస్కృతిక విప్లవం

**డా॥ కత్తి పద్మారావు**

**వెల : రూ.150/- పేజీలు : 152**

**ప్రతులకు : (08643) 42840**

ఈనాడు దళిత బహుజనుల్లో బౌద్ధం విరివిగా వ్యాపిస్తూ వుంది. హిందూ సంస్కృతికి ప్రత్యామ్నాయంగా బౌద్ధ జీవన ధర్మం మానసిక విప్లవాన్ని తీసుకొస్తుంది. వ్యక్తి ఆస్తికి, సామాజిక దోపిడికి, రాజకీయ పెత్తనానికి, కుల ఆధిపత్యానికి వ్యతిరేకంగా బౌద్ధం ఒక ప్రత్యామ్నాయ జీవన విధానాన్ని రూపొందించింది. సంపద అందరికీ పంపిణీ కావడం కోసం, అందరూ దుఃఖం లేకుండా జీవించడం కోసం, బౌద్ధ సూత్రాలు ఉపకరిస్తాయి.

**డా॥ కత్తి పద్మారావు**




## సాంఘిక విప్లవమూర్తి డా॥ అంబేద్కర్ జీవితం - సిద్ధాంతం

**డా॥ కత్తి పద్మారావు**

**వెల : 80 పేజీలు : 130**

అంబేద్కర్ జీవితం ఒక పోరాట దృక్పథాన్ని నేర్పుతుంది. జీవితానికి ధైర్యాన్నిస్తుంది. బానిసత్వం నుండి మనిషిలో ధీరత్వాన్ని నిలుపుతుంది. అందువల్ల అంబేద్కర్ జీవితాన్ని సిద్ధాంతాన్ని ప్రతి ఒక్కరు అధ్యయనం చేస్తూ ముందుకెళ్ళవలసిన చారిత్రక సందర్భమిది.

**డా॥ కత్తి పద్మారావు**



## నూరేళ్ళ నూరుగురు కథకులు నూరు కథానికలు

**జయంతి పాపారావు**

**వెల : రూ.262/- పేజీలు : 382**

**ప్రతులకు : 0891-2557961**

1910 నుంచి వార్షిక క్రమపద్ధతిలో కథానికలను సేకరించడంలో ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొన్నాను. ఎంతో శ్రమించాను. ఎంతో డబ్బు ఖర్చుపెట్టాను. ఏ ఒక్క గ్రంథాలయంలోనూ పాత పత్రికలు దొరికే పరిస్థితిలేదు. ఎన్నో గ్రంథాలయాల్లో వెదకాల్సి వచ్చింది. కథానికల తొలి ప్రచురణ వివరాలు కోసం ఎన్నెన్నో పత్రికలు తిరగేయాల్సి వచ్చింది. మానేద్దామన్నంత నిరాశ కలిగింది. ఓడిపోవడం ఇష్టం లేక, అతికష్టం మీద పూర్తి చేశాను.

**జయంతి పాపారావు**

## స్వప్న శకలం

సి. హెచ్. ప్రకాశ్

వెల : రూ.70/- పేజీలు : 60

**ప్రతులకు : 9346403040**




స్వప్నశకలం – దీర్ఘకవితలో విజ్ఞానశాస్త్రం, సౌందర్యభావన, కవితాత్మకత ముప్పేటగా మేళవించినై, దీనికి 'తాత్త్వికభావన' సుగంధ మద్దినట్టైంది. మొదటిసారిగా తెలుగులో విశ్వావిర్భావాన్ని గూర్చి సి. హెచ్. ప్రకాశ్ రాసిన ఈ దీర్ఘ కవిత ప్రత్యేకంగా నిలుస్తుంది.

**అద్దేపల్లి రామమోహనరావు**

## కరీంనగర్ జిల్లా నాటకరంగం – ఒక పరిశీలన

కోటగిరి జయవీర్

వెల : 120 పేజీలు : 194

**ప్రతులకు : 9492461114**



రంగస్థలంపై నటులు ఏడ్వడం నాటకం కాదు. వారిని చూసి ప్రేక్షకులు కంట తడిపెట్టడం నాటకం అని అంటారు. అలాంటి నటులూ కరీంనగర్ జిల్లాలో ఎంతోమంది ఉన్నారు. వారి గురించి తెలుసుకోవడం ఎంతో ఆసక్తిదాయకం. నాటకం నవరసాలకూ నిలయం. నాటకం ప్రధానాంశంగా రూపుదిద్దుకున్న ఈ పుస్తకం కూడా అలాంటిదే. అలనాటి చరిత్ర చదువుతుంటే ఆనందం, బాధ, ఆగ్రహం, ఆశ్చర్యం... ఇలా ఎన్నో భావాలు మదిలో మెదలుతుంటాయి.

**వేదకుమార్.ఎమ్.**

## అనురాగ స్పర్శ

డా॥ మల్లెమాల వేణుగోపాలరెడ్డి

వెల : రూ.75/- పేజీలు : 121

**ప్రతులకు : విశాలాంధ్ర, ప్రజాశక్తి నవోదయ, దిశ పుస్తక కేంద్రాలు.**




మల్లెమాలగారు కథాశిల్పంతోనూ, శైలితోనూ విన్యాసాలు చేయాలనుకోరు. చెప్పదలచుకున్న విషయాన్ని పాఠకుడిపైన బలంగా ప్రభావితం చేసేలా సాకల్యంగా, తీరిగ్గా, విప్పి చెప్పాలని కూడా భావించరు. పాఠకుడ్ని తనంతటి విద్యావేత్తగా గుర్తించి, అతని భుజంపైన చేయి వేసుకుని, ప్రేమగా కథలో చెబుతూ పోతారు. ఆయన కథల చదివాక మనం మంచిని గౌరవించాలనీ, చెడుని ద్వేషించాలనీ తప్పకుండా అనుకుంటాం.

**మధురాంతకం నరేంద్ర**

## కాల సూచికలు

మొహమ్మద్‌ఖాన్

కవిత్వం

వెల : రూ.100 పేజీలు : 144

**ప్రతులకు : 9440137475**




సాహిత్య ప్రక్రియ కవిత్వంలో నేను ఎన్నుకున్న మార్గాలు అది కవిత రూపమయిన, దీర్ఘ కవితయినా, మినీ కవితయినా, హైకూ కవితయినా, కథానిక లేక కథ అయినా నా అక్షరాలు, క్రమశిక్షణకు కట్టుబడి మనిషి ఏ విధంగా ఎదగాలన్న విధానాన్నే చూపిస్తాయి. తప్పో తాక్యమో, చక్కభజనో, బానిసత్వమో ఇత్యాది వక్రమార్గాలతో కూడిన సూచనలు ఎట్టి పరిస్థితులలోనూ సుటంకించవు.

**మొహమ్మద్ ఖాన్,**

## సంస్కారం కథలు

రేగులపాటి కిషన్‌రావు

వెల : రూ.55/- పేజీలు : 154

**ప్రతులకు : 7396036922**




ఈ కథలు సమాజ ప్రతిఫలనాలు. మంచితనం, సంస్కారం, సహృదయత ఎప్పటికైన గెలుస్తుంది. మంచే నిలుస్తుంది. మనిషికి ఆదర్శం అంటూ ఒకటి ఉండాలి. కష్టాల్లో కూడా మొక్కవోని ధైర్యంతో నిలబడితే జీవితాన్ని తిరిగి గెలుచుకోవడం, మరింత ఎదగడం... ఎంతో దూరంలో లేదు అని ఈ కథలు గొప్ప హామీనిస్తాయి.

**– రేగులపాటి కిషన్‌రావు**

## అవును నిజమే !

కథలు

డి. రామచంద్రరాజు

వెల : 100 పేజీలు : 112

**కాపీలకు : 9908324214**




జీవితానుభవాలనుంచీ, విస్తృత అధ్యయనం నుంచీ జీవితాన్ని శాసిస్తున్న శక్తుల గ్రహణ శక్తి నుంచీ, గాఢమైన భావుకత్వం నుంచీ, సమాజంలోని మంచిని పెంచాలనే తపన నుంచీ, చెడును నిర్భయంగా వెల్లడించాలనే, ఖండించాలనే నిబద్ధత నుంచీ రాజు కథలు పుట్టాయి.

**కేతు విశ్వనాథరెడ్డి**

# ప్రపంచీకరణ అన్ని అనర్థాలకు మూలం

## 'విన్యాసం' ఆవిష్కరణలో గేయానంద్

నూతన ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణే అన్ని అనర్థాలకు మూలం అని ఎమ్మెల్సీ గేయానంద్ అన్నారు. జూలై 9న ఆదోని పట్టణంలోని భీమాస్ హాలులో కవి కెంగారు మోహన్ రచించిన విన్యాసం పుస్తకాన్ని ఆవిష్కరించారు. సాహితీ స్రవంతి డివిజన్ అధ్యక్షులు ఆవుల బసప్ప అధ్యక్షతన జరిగిన సభలో గేయానంద్ మాట్లాడారు. 1991లో పి.వి నరసింహరావు ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక విధానాలను ప్రస్తుత ప్రధాన మంత్రి మన్మోహన్‌సింగ్ అమలు చేయడం వల్లనే దేశంలో అనిశ్చిత పరిస్థితి ఏర్పడిందన్నారు. ధనికులు మరింత ధనికులుగా పేదలు మరింత పేదలుగా మారుతున్నారన్నారు. సెజ్‌ల పేరుతో లక్షలాది ఎకరాల భూములను ధనవంతులు స్వాధీనం చేసుకుంటున్నారని అన్నారు. పేదవాడు గుడిసె వేసుకునేందుకు ప్రయత్నిస్తే దొంగల్లా చూస్తున్నారని అన్నారు. 13 లక్షల ఉద్యోగాల్లో 6 లక్షల ఉద్యోగాలు కాంట్రాక్ట్ ఉద్యోగులుగా ఉన్నారంటే ప్రపంచీకరణే కారణమన్నారు. కెంగారు మోహన్ రచించిన విన్యాసం పుస్తకంలో మార్కెట్ శక్తుల విజృంభణ, స్వేచ్ఛా మార్కెట్ విషవలయం కారణంగా



ఆదోనిలో కెంగార మోహన్ కవితా సంపుటి 'విన్యాసం' ఆవిష్కరణ సభ

అన్ని రంగాల్లో మనిషి ఎదుర్కొంటున్న సంక్లిష్ట సందిగ్ధ సంఘర్షణలు కనిపిస్తాయన్నారు. బహుళ జాతి కంపెనీలు చేస్తున్న వికృత విన్యాసాల వంటివి ఈ కవితా సంపుటిలో కనిపిస్తాయన్నారు. యువ రచయితలు ఇలాంటి రచనలు చేసి ప్రజలను చైతన్యవంతులను చేసేందుకు కృషి చేయాలన్నారు. ఈ సభలో జనవిజ్ఞాన వేదిక రాష్ట్ర నాయకులు డాక్టర్ రంగన్న కవులు ఎ.వి. సుబ్బారెడ్డి, సంజన్న, ప్రసాద్, ప్రహ్లాద్, హరికిషన్, నల్లారెడ్డి పాల్గొన్నారు.

# ఎం. అల్లాబక్ష్‌కి తంగిరాల స్మారక అవార్డు

తిరుపతి ఎస్వీనగర్ పోస్టాఫీసు వద్ద జులై 7న ప్రముఖ పౌరాణిక రంగస్థల పద్యనటులు ఎం. అల్లాబక్ష్‌కి 13వ తంగిరాల స్మారక రంగస్థల పురస్కార ప్రధానం జరిగింది. రూ.1116/- నగదు, శాలువ, జ్ఞాపిక, పూలహారాలతో తంగిరాల ట్రస్టు ఛైర్మన్ తంగిరాల చక్రవర్తి ప్రధానం చేశారు. ఆయన ఈ సభలో అంతరించిపోతున్న పద్య నాటకాన్ని పునరుద్దరించాలని ప్రజా కళాకారులు నాటకాన్ని జనచైతన్యం కోసం కృషి చేయాలని ప్రపంచీకరణ నేపథ్యంలో అంతరించిపోతున్న మన కళలను కాపాడుకోవాలని, అధ్యక్షోపన్యాసంలో పేర్కొన్నారు. నాటక రంగం కోసం, దాని ఔన్నత్యం కోసం సెమినార్స్, సభలు, స్మారకోపన్యాసాలు ఏర్పాటు చేయడం ద్వారా తమవంతు కృషి తంగిరాల ట్రస్టు చేస్తుందని పేర్కొన్నారు. గతంలో తంగిరాల స్మారక అవార్డు పొందిన ప్రముఖులలో కళాప్రపూర్ణ డా॥ మిక్కిలినేని రాధాకృష్ణ మూర్తి, కళాప్రపూర్ణ, డా॥ పోతుకూచి సాంబశివరావు, ఆచంట వెంకటరత్నం నాయుడు, జి. జయరాజు, బుర్రా సుబ్రహ్మణ్య శాస్త్రి, డా॥ బోయిభీమన్న దుగ్గిరాల సోమేశ్వరరావు, గండవరం సుబ్బరామి రెడ్డి, కందిమళ్ళ ప్రతాపరెడ్డి, పద్మశ్రీ కె. శోభానాయుడు, కర్నాటి లక్ష్మి నర్సయ్య, చాట్ల శ్రీరాములు, డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు లాంటి ప్రముఖులు వున్నారని ముఖ్య అతిధిగా పాల్గొన్న చింతా వేంకటేశ్వర్లు పేర్కొన్నారు. ఆ పరంపరలో నేడు అల్లాబక్ష్ గారికి ఈ అవార్డు రావడం




ముదావహం అన్నారు. నేడు ఆయన పుట్టినరోజు కావడం కూడా సంతోషకరమని పేర్కొన్నారు. బంధువుల, కుటుంబసభ్యులు, మిత్రులు, తోటి రంగస్థల కళాకారులు ఈ సభలో పాల్గొన్నారు. ఈ సభలో అబ్జ క్రియేషన్స్ అధినేత కోడిహళ్ళి మురళీమోహన్, సిస్టర్ నివేదిత హైస్కూల్ ప్రిన్సిపాల్ కె.వి.ఎన్.ఎల్. ప్రసన్నకుమారి, సోషల్ యాక్టివిస్ట్ టి. చంద్రశేఖర్, సమతాసేవా సమితి అధ్యక్షులు శ్రీ చింతా వేంకటేశ్వర్లు, వేదవ్యాస రంగబట్టార్, జంగం ధర్మారావు, పచ్చా బలరామయ్య, జె.ఎస్. రఘుపతిరావు, స్థానిక రంగస్థల కళాకారులు ఈ సభలో పాల్గొన్నారు. తనకు జరిగిన సన్మానానికి కృతజ్ఞతలు అల్లాబక్ష్ తెలియజేశారు. తంగిరాల మెమోరియల్ ట్రస్ట్ టి.ఎస్.సుందర్ స్వాగతం, వందన సమర్పణ చేశారు

# మెరుగు కథా పఠనం

విజయనగరంలో గురజాడ స్వగృహంలో జూలై 15న 'మెరుగు' కార్యక్రమం జరిగింది. కవితలతో పాటు కథలు కూడా మెరుగుపడి సమాజానికి దోహదపడాలనే ఉద్దేశ్యంతో కథాపఠన కార్యక్రమం ఏర్పాటుచేసామని సాహితీస్రవంతి జిల్లా కన్వీనర్ చీకటి దివాకర్ అన్నారు. కథ ఎక్కువమంది పాఠకులను సమకూర్చుకుంటుందని కథల ద్వారా సమాజంలో ఉన్న మలినాన్ని, సమస్యలను ప్రజలకు చేరవేసి, చైతన్య పరచాల్సిన బాధ్యత రచయితకు ఉందన్నారు. వి. వెంకట్రావ్ మాట్లాడుతూ కథలు వ్రాసి అట్టిపెట్టుకోవడం వలన ప్రయోజనం లేదని, నలుగురిలో చర్చించాలని అన్నారు. పత్రికల్లో అచ్చయిన కథలే మంచి కథలు అనే అభిప్రాయం సబబు కాదన్నారు. ఈ కార్యక్రమంలో మన్యంరమేష్ "ఖాళీ" కథ, సురేష్‌కుమార్ పారిజాతం కథ, చివుకుల శ్రీలక్ష్మి. వారసత్వ సంపద కథలను చర్చించారు. పాల్గొన్నవారు వారి వారి అభిప్రాయాలను, సూచనలను తెలియజేశారు. కథలు సాగదీసే విధంగా ఉండకూడదని, రచయిత చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా, అర్థమయ్యే విధంగా చెప్పాలని, పాఠకున్ని పరీక్షించే విధంగా ఉండకూడదని, వ్రాసేటప్పుడు వీటిని దృష్టిలో పెట్టుకొని రచనలు రావాలని శ్రీరాంమూర్తి కోరారు. చాగంటి తులసి సమన్వయ పరుస్తూ సాహితీస్రవంతి 'మెరుగు' అందర్నీ మెరుగుపడేటట్లు చేస్తుందని ఇక్కడికి వచ్చేవారు మెరుగుపడాలని కోరుకునే వస్తారని. మెరుగుకు వచ్చేవారు మెరుగుపడతారే గాని డీలాపడరన్నారు. కవితా పఠనానికి, కథా పఠనానికి తేడా ఉందని కథా పఠనం చేసినపుడు చదువరులు కాని వారికి సైతం అందేటట్లు ఉండాలన్నారు. ఏ భావజాలంతో ఇక్కడికి వస్తున్నామో, దానిని గుర్తెరిగి, ప్రోత్సహా, నిరుత్సాహాలతో సంబంధం లేకుండా నిబద్ధతతో రచనలు చేయాలన్నారు. కమిట్‌మెంట్ ఉంటేనే అలా వ్రాయగలమని కూడా స్పష్టం చేశారు. కథకు ఏకోన్ముఖత అవసరమని, ఎక్కువ వివరణ ఇవ్వకుండా ఒక్కముక్కలో చెప్పగలగాలని చిక్కదనము అవసరమని, కవితలనే కప్పి చెప్పగలిగి పాఠకులు గ్రహించేటట్లు చేయాలన్నారు. ఈ చర్చలో గంద్రేటి శ్రీనివాస్ పాట, పాయల మురళీ పద్యాలను వినిపించారు.



విజయనగరం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో లో 'మెరుగు' వేదికపై 'కథా పఠనం'

– చంద్రికారాణి

## సర్దేశాయి తిరుమలరావు రచనలు పంపండి

సర్దేశాయి తిరుమలరావు (1928-1994) కన్యాశుల్కం - నాటకకళ, సాహిత్యతత్వము, శివభారత దర్శనము వంటి గ్రంథాలు రచించిన ప్రముఖ సాహిత్య విమర్శకులు. ఆయిల్ టెక్నాలజికల్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ (ఓ.టి.ఆర్.ఐ) అనంతపురంలో సంచాలకులుగా పదవీ విరమణ చేశారు. తైల పరిశోధనా రంగంలో అంతర్జాతీయ స్థాయి పరిశోధనా పత్రాలు నాలుగు వందల దాకా వెలువరించిన విఖ్యాత శాస్త్రవేత్త కూడా. సునిశిత వ్యాఖ్యలకు, విభిన్న దృక్పథానికీ పేరుగాంచిన సర్దేశాయి తిరుమలరావు భారతి, ఆంధ్రపత్రిక, హిందూ, బ్లిడ్జ్, ఇలస్ట్రేటెడ్‌వీక్లీ, సైన్స్‌టుడే పత్రికల్లో ఎన్నో రచనలు విభిన్నమైన పేర్లతో చేశారు. ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా కొంతమందితో నిరంతరాయంగా సంభాషించేవారు. సర్దేశాయి తిరుమలరావుని గుర్తుచేయాలనే తలంపుతో ఒక పుస్తకం ప్రచురించాలని భావిస్తున్నాం. సర్దేశాయి తిరుమలరావు వ్యాసాలు, ఉత్తరాలు, వ్యాఖ్యలు, ఆయన గురించి రాసిన విశ్లేషణగానీ పంపి సహకరించవచ్చు. మా **చిరునామా : కోడిహళ్ళి మురళీమోహన్, 9111, బ్లాక్ 9ఎ, జనప్రియ మహానగర్, మీర్‌పేట, హైదరాబాదు - 500097, మొబైల్‌నెం 9701371256, 9440732392**

**-డా॥ నాగసూరి వేణుగోపాల్**

## పర్యావరణ కథానికల కోసం

పర్యావరణ విధ్వంసం, తీవ్ర కాలుష్యం కారణంగా కలిగిన సామాజిక సమస్యలనూ, మార్పులనూ శక్తివంతంగా చిత్రించిన కథానికలతో ఓ ఉత్తమ సంకలనం వెలువరిస్తున్నట్టు విహారి & నాగసూరి ఒక ప్రకటనలో తెలిపారు. పర్యావరణానికి సంబంధించిన అన్ని పార్శ్వాలనూ, పర్యావరణ ఫిలాసఫిని ప్రతిఫలింపచేస్తూ 1991-2010 మధ్యకాలంలో వెలువడిన తెలుగు కథలను పరిశీలన కొరకు పంపమని కోరారు. అటువంటి కథలు గానీ, లేదా ఆ కథలకు సంబంధించిన సమాచారం గానీ నెలలోపు ఈ చిరునామాకు పంపాలి. **- సంపాదకులు, పర్యావరణకథా సంకలనం, బి-517, విల్లా హైట్స్, బ్రాహ్మణవాడి, బేగంపేట, హైదరాబాద్ -500016. 9848025600, 9440732392**

## వేకువ కవితా పురస్కారం - 2012

వేకువ సాహితీ కళా సమాజ సేవా సంస్థ ఆధ్వర్యంలో వచన కవితల పోటీ నిర్వహిస్తున్నట్లు ఆ సంస్థ అధ్యక్షులు ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పోటీలో గెలుపొందిన పది మంది ఉత్తమ కవులు/కవయిత్రులకు "వేకువ కవితా పురస్కారాలు" అందజేస్తారు. ప్రపంచశాంతి అంశంపై 30 లైన్లకు మించకుండా వ్రాసి మూడు కాపీలు పంపాలి. పేరు, చిరునామా హామీ పత్రం మీద మాత్రమే వ్రాయాలి. కవితలను **జాబిలి జయచంద్ర, అధ్యక్షులు, వేకువ సాహితి కళా సమాజ సేవా సంస్థ, న్యూ కాలనీ, మడకశిర రోడ్డు, పెనుకొండ, అనంతపురం జిల్లా, పిన్: 515110 చిరునామాకు పంపాలి.** ఇతర వివరాలకు **9491990313, 9441508510** ద్వారా సంప్రదించవచ్చును.

# నిజామాబాద్‌లో దశాబ్ది జనకవనం




నిజామాబాద్ జిల్లాలో సాహితీ(స్రవంతి, సిఐటియు సంయుక్త ఆధ్వర్యంలో జరిగిన జనకవనం సభలో మాట్లాడుతున్న సిఐటియు జిల్లా అధ్యక్షులు పి. సిద్ధిరాములు, చిత్రంలో సాహితీ(స్రవంతి జిల్లా కన్వీనర్ మల్లవరపు విజయ, ప్రజానాట్యమండలి జిల్లా అధ్యక్షులు సిర్పలింగం

సిఐటియు 13వ రాష్ట్ర మహాసభల సందర్భంగా నిజామాబాదు సాహితీ స్రవంతి, సిఐటియు ఆధ్వర్యంలో జిల్లా స్థాయి జనకవనం జూన్3న నిజామాబాద్ పట్టణంలోని సిఐటియు కార్యాలయంలో శ్రీమతి మల్లవరపు విజయ అధ్యక్షతన జనకవనం జరిగింది. సాహితీ స్రవంతి కన్వీనర్ మల్లవరపు విజయ మాట్లాడుతూ కలాన్ని ఖడ్గంగా మలచి అక్షరాలకి ఆజ్యం పోసి అభ్యుదయ బాటలో విప్లవ శంఖం పూరించిన నాడే అవినీతిని అంతమొందించగలం అన్నారు. సిఐటియు జిల్లా అధ్యక్షులు పి సిద్ధిరాములు మాట్లాడుతూ బీడి కార్మికులు, అంగన్‌వాడి, ఆశ వర్కర్ల గురించి మాట్లాడుతూ శ్రమకు తగ్గ ఫలితం ఇవ్వటం లేదంటూ వారి కోసం కార్మిక, కర్షకుల కోసం పోరాడాలన్నారు. ప్రజానాట్య మండలి జిల్లా అధ్యక్షులు సిర్పలింగం విప్లవ గీతాలతో అలరించారు. ప్రజా కళా మండలి జిల్లా అధ్యక్షులు షహీద్ మియా మాట్లాడుతూ సమాజంలో జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను నిలదీసి, పతనమైపోతున్న సమాజాన్ని కాపాడుకుందామన్నారు. ఈ జనకవనంలో పలువురు కవులు, కళాకారులు, ఉర్దూ రచయితలు పాల్గొని వారి కవితలను, పాటలను వినిపించారు. ఈ కార్యక్రమానికి పలువురు ప్రముఖులు, కార్మికులు, ప్రజలు పాల్గొన్నారు. ఈ కార్యక్రమములో సిఐటియు జిల్లా కార్యదర్శి రమేష్ బాబు, కవులు, సాహిత్యాభిమానులు పాల్గొన్నారు.

– మల్లవరపు విజయ

# జాషువా 41వ వర్ధంతి సభ



నిజామాబాద్‌లో జూలై 24న జాషువా వర్ధంతి సభలో చిత్రపటానికి పూలమాల వేస్తున్న సి. హెచ్. మధు, సిర్పలింగం, విజయలక్ష్మి తదితరులు

నిజామాబాద్‌లో సాహితీ స్రవంతి, జనవిజ్ఞాన వేదిక, ప్రజానాట్య మండలి, కె.వి.పి.ఎస్ జిల్లా కమిటీల ఆధ్వర్యంలో జూలై 24న కవి కోకిల గుర్రం జాషువా 41 వర్ధంతి స్థానిక యస్. యస్. ఆర్ డిగ్రీ కాలేజి ప్రాంగణంలో జరిగింది. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిధిగా సీనియర్ కవి సి. హెచ్ మధు పాల్గొన్నారు. సిఐటియు నాయకురాలు బి. విజయలక్ష్మి కవులకు కళాకారులకు ఆహ్వానం పలిగారు. అనంతరం జరిగిన సభకు యుటిఎఫ్ పోశెట్టి సభాధ్యక్షులుగా వ్యవహరించారు. కె.వి.పి.ఎస్ జిల్లా నాయకులు మల్యాల గోవర్ధన్, సిర్పలింగం ప్రజా నాట్యమండలి జిల్లా కార్యదర్శి రాష్ట్ర కార్యవర్గ సభ్యులు సభలో ప్రసంగించారు. జాషువా గారి చిత్రపటానికి సి. హెచ్ మధు పూలమాల వేసి నివాళి అర్పించారు. ఆయన మాట్లాడుతూ జాషువా అగ్రవర్ణ దురంహంకారాల్ని వ్యతిరేకించిన అక్షర యుద్ధ సైన్యాధిపతి అన్నారు. సుకవి ప్రజల నాల్కల యందు జీవిస్తారని విశ్వనరుడిగా తనను తాను ప్రకటించుకున్న ధైర్యశాలి అని కొనియాడారు. యుటిఎఫ్ పోశెట్టి మాట్లాడుతూ జాషువాది విలక్షణ భావజాలం అన్నారు. అధునాతమైన శైలితో సమాజ దుష్టత్వం మీద నిప్పులు చెరిగారని అన్నారు. ఎల్.ఎస్. రావు మాట్లాడుతూ జాషువా మా తండ్రికి బంధువని ఆయనకు తన కుటుంబానికి ఉన్న సంబంధాలు ప్రత్యక్ష కథనం వివరించారు. నూతన తరానికి జాషువాను పరిచయం చేయాల్సిన అవసరముందని 'ఇచ్చోటనే సత్యవీంద్రుని కమ్మని కలం' పద్యము ఉటంకించారు. ప్రముఖ న్యాయవాది రాజునాయర్ సుభేదారు మాట్లాడుతూ సాహితీస్రవంతి కార్యక్రమాలు తీసుకుని ప్రజల వద్దకు వెల్తున్న క్రమంలో చేయూత నివ్వడానికి సిద్ధంగా ఉన్నానని అన్నారు. ఉత్సాహభరిత సందేశాన్నిస్తు ఇలాంటి కార్యక్రమాలు విద్యార్థుల మధ్యకు వెళితే ఎంతో గొప్ప ఉపయోగముంటుందని వివరించారు. ప్రముఖకవి వెన్ను గంగాధర్ స్వీయ కవితాగానం చేసారు. ప్రముఖ కవి రచయిత పదాల రామారావు పద్య కవితల్ని వివరిస్తూ జాషువా అగ్రవర్ణ దురహంకారాలను దుయ్యబట్టారని అన్నారు. ఇటీవల లక్ష్మీపేట దాడిని ఖండించారు. అబ్బన్న కవి గాయకులు, వాయిద్య కారులు మాట్లాడుతూ అగ్రవర్ణ దురహంకారంపై తన ఆగ్రహాన్ని వ్యక్తపరిచారు. జిల్లా సి.పి.ఎం. కార్యదర్శి పెద్ది వెంకటరాములు జాషువా జీవిత విశిష్టతను వివరించారు. ప్రజానాట్యమండలి జిల్లా అధ్యక్షులు సిర్పలింగం తన కంఠంతో జాషువాకు జోహారు అర్పిస్తు గానం చేసారు. మరియు 'గబ్బిలం' లోని పదపద్యాల విడి భాగాలను పద్య రూపంలో ఆలపించారు. ఈ కార్యమ్రంలో ఇంకా జిల్లా కెవిపిఎస్ నాయకులు మల్యాల గోవర్ధన్, దశరథ్, లక్ష్మణ్, భాగ్య, యాదయ్య సంగీతవాద్య కారులు ఆంజనేయులు డప్పురాజు, సతీష్ తదితర కళాకారులు పాల్గొన్నారు. కవులు, కళాకారులు కవితాగానం చేసి అలరించారు.

– సిర్పలింగం

# ప్రశ్నించడం నేర్పిన జాషువా సాహిత్యం

జూలై 24న సుందరయ్య విజ్ఞాన కేంద్రంలోని ఐలమ్మ వేదికపై మహాకవి గుర్రం జాషువా 42వ వర్ధంతి సభ జరిగింది. హైదరాబాద్ నగర సాహితీ స్రవంతి ప్రధాన కార్యదర్శి జి. యాదగిరి రావు అధ్యక్షతన జరిగిన ఈ సభలో కుల వివక్ష పోరాట కమిటి రాష్ట్రనేత జాన్‌వెస్లీ ముఖ్య అతిథిగా హాజరై ప్రసంగించారు. తరతరాలుగా అణచివేతకు గురవుతున్న దళితులు చైతన్య వంతులై ప్రతిఘటిస్తునందునే, ప్రశ్నిస్తున్నందు వల్లే ఈనాడు దాడులు జరుగుతున్నాయని, దళితులపై దాడులు అత్యధికంగా జరుగుతున్న రాష్ట్రాల్లో ఏ.పి 3వ స్థానంలో వుందని, అత్యాచారాలు దేశంలో ఈ ఒక్క సంవత్సరంలోనే లక్షకు పైగా జరిగాయని అన్నారు. జన చైతన్యం ద్వారానే మన హక్కులు దక్కించుకోవాలి అని అన్నారు. సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి ప్రసంగిస్తూ కవి పరంపరలో జాషువా సుస్థిర స్థానం పొందటమే గాక, భాష మీద, భావం మీద, సాహిత్యం మీద పట్టు సాధించారని, తన రచనల్లో ప్రశ్నించేతత్వాన్ని చొప్పించి, మెప్పించే రచనలు చేసి పండితులచే సత్కారాలు పొందారని, వీరేశలింగం గారికి తన రచనలు వినిపించారని, పద్యకవుల్లో జాషువే అగ్రశ్రేణి కవిగా ఎదిగారని అన్నారు. లౌకికభావజాలం కనిపించే ఆయన విశ్వవాదడనేను అని ప్రకటించుకొన్నారని ఆరోజుల్లోనే క్రైస్తవులు, హిందువులు, ఆయన్ని ఆయన సాహిత్యాన్ని కాదంటే మసీదులో కూర్చొని కవిత్వం రాసారని, వివక్షతకు, అంటరానితనానికి, పేదరికానికి గురైన కవిగా ఎదిగాడన్నారు. ఈశ్వరుని వద్దకు దూతగా గబ్బిలాన్ని జాషువా పంపారని, పూజారి లేని వేళ, తల క్రిందులుగా వ్రేలాడే గబ్బిలం శివుని చెవిలో తన వేదనని వినిపించారని అన్నారు. తన రచనల ద్వారా నాల్గుపడగల హైందవ నాగరాజుని నిరసించారని, కృష్ణ శాస్త్రి భావకవిత్వం రాస్తే రాజరికాన్ని నిరసిస్తూ రాజు జీవించె రాతి విగ్రహాలందు, సుకవి జీవించే ప్రజల నాలుకలయందూ అంటూ వేలకోట్ల దేవతలు ఎగబడ్డ దేశం ఇది అంటూ ఆనాటి రాజకీయాలపై సైతం కవిత్వం రాసిన జాషువా సాహిత్యాన్ని మనం లోతుగా అధ్యయం చేసి సమగ్ర విశ్లేషణ చేయల్సి వుందని అన్నారు. వేమన తర్వాత జాషువా, కరణశ్రీలు పద్య కవుల్లో అగ్రేసరులుగా కనిపిస్తారని అన్నారు. శాంతిశ్రీ ఆధ్వర్యంలో జరిగిన కవి సమ్మేళనంలో లక్ష్మి కాంతశర్మ జాషువా రాసిన హరిశ్చంద్ర నాటకంలోని పద్యాలు జనరంజకంగా పాడి వినిపించారు. నాగశిరీష, వొరప్రసాద్, ప్రభాకర్, లక్ష్మీనారాయణ, వరహాలరావు, నాగరాణి, డి. కామేశ్వరరావు, గేరా, సురేష్, ఆలువాలు సురేష్, యాదగిరి రావు, వెంకటి, తంగిరాల చక్రవర్తి, తదితరులు స్వీయ కవితలు వినిపించారు. సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ స్వాగతం పలికిన ఈ సభకు సాహితీ స్రవంతి నగర నాయకులు గేరా (సురేష్) వందన సమర్పణ చేసారు. దళిత సంఘాలు, నాయకుల, విద్యార్థులు, మహిళలు సాహిత్యాభిమానులు ఈ సభలో పాల్గొన్నారు. సభా ప్రారంభంలో సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు, తెలకపల్లి రవి, కె.వి.పి.ఎస్ రాష్ట్ర కార్యదర్శి జాన్ వెస్లీలు జాషువా చిత్రపటానికి పూలమాలలు వేసి నివాళులు అర్పించారు.



జూలై 24న హైదరాబాద్‌లో సుందరయ్య విజ్ఞానకేంద్రంలో జరిగిన జాషువా వర్ధంతి సభలో 'దళితులు-దాడులు' అంశంపై ప్రసంగిస్తున్న కెవిపియస్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి జాన్‌వెస్లీ

– తంగిరాల చక్రవర్తి

# చెన్నైలో జాషువా వర్ధంతి

చెన్నైలోని సీతారామనగర్ తెలుగు ప్రజా సంక్షేమ సంఘం ప్రాంగణంలో జూలై 24 సాయంత్రం 'జనని' ఆధ్వర్యంలో 'విశ్వనరుడు' జాషువా 41వ వర్ధంతి జరిగింది. చి॥ప్రవలిక ప్రార్థన చేయగా, సభకు పట్టాభిరామయ్య అధ్యక్షత వహించారు. నారాయణరావు స్వాగతం పలికారు. ముందుగా పి.సి.పాపయ్య ప్రసంగిస్తూ ఎంతోమంది తెలుగువారున్నా, తెలుగు భాషకు ప్రాధాన్యత లేదని, ఇందుకు ఐక్యత లేకపోవడమే ప్రధాన కారణమని అన్నారు. గుడిమెట్ల చెన్నయ్య, తమ ప్రసంగంలో సాంకేతికపరంగా మనం ఎంతో అభివృద్ధి చెందినా, మనిషిని మనిషిగా గౌరవించే మానవత్వం మాత్రం నశించిపోవడం దురదృష్టకరమని వాపోయారు. కవి, రచయిత యిమ్మడిశెట్టి కోటేశ్వర్రావ్ తమ ప్రసంగంలో మానవులు పడే కష్టాలను తమ కవితల ద్వారా జాషువా మనకు తెలిపారని చెప్పారు. 'గబ్బిలం' వంటి రచనల ద్వారా సమాజంలోని లోటుపాట్లను ఎత్తి చూపారని అన్నారు. సమాజానికి దిశానిర్దేశం చేసే ఎన్నో ఖండికలను ఆయన మనకు అందించారని చెప్పారు. ఆయన రచనలలో కరుణరసానికి ఎక్కువ ప్రాముఖ్యత ఉంటుందని కొన్ని ఉదాహరణల ద్వారా పేర్కొన్నారు. వంజరపు శివయ్య ప్రసంగిస్తూ, ఒక వ్యక్తిని మనం ఇంతకాలం పాటు గుర్తుంచుకుంటున్నామని అంటే, ఆయన సమాజానికి చేసిన సేవ అలాంటిదని చెప్పారు. తనలో రేగిన ఆలోచనలను కత్తిలాంటి తన కలంతో ఎత్తి చూపారని అన్నారు. జె. మధుసూదనరావు వందన సమర్పణ చేసారు.





సతీష్ దుబే, తేజ్‌రాజ్ జైన్‌ల హిందీ గ్రంథాలను 'జీవన సమరం' 'స్వేచ్ఛా విహంగం'ల పేరిట జి.పరమేశ్వర్ తెలుగులోకి అనువదించిన గ్రంథాలను డా॥ఎన్ గోపీ ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో స్వేచ్ఛా విహంగం మూలకర్త తేజ్‌రాజ్ అనువాదకులు జి. పరమేశ్వర్, డా॥ ఐన్‌గొజైన్ డా॥ రాళ్ళ బండి కవితా ప్రసాద్, దైవజ్ఞశర్మ, డా॥ సుమన్ లత ఉన్నారు.



రాయసం ఫౌండేషన్, కిన్నెర ఆర్ట్ థియేటర్స్ సంయుక్తాధ్వర్యంలో నెలకొల్పిన శ్రీరాయసం సుబ్బారాయుడు స్మారక సాహితీ పురస్కారాన్ని ప్రముఖ కవి ఆచార్య ఎన్. గోపికి హైదరాబాద్‌లో డా॥ సి. నారాయణరెడ్డి అందజేస్తున్న దృశ్యం. చిత్రంలో డా॥ ఓలేటి పార్వతీశం, డా॥ వెంకట్రావు, సాంస్కృతికశాఖ డైరెక్టర్ డా॥ రాళ్ళబండి కవితాప్రసాద్, దూరదర్శన్ పూర్వ డైరెక్టర్ డా॥ పి. మధుసూదన్ రావు, రాయసం వెంకట్రామయ్య, కిన్నెర అధినేత మద్దాలి రఘురాం ఉన్నారు.



తెలుగు భాషాభివృద్ధి సమితి రామచంద్రపురం శాఖవారి ఆధ్వర్యంలో నానీలు, రెక్కలు, హైకూలు మూడు ప్రక్రియల పుస్తకాలు మార్చి 8న ఆవిష్కరించబడిన సభలో యువ, నవ కవులచే సత్కరించబడుతున్న జి. సుబ్బారావు . చిత్రంలో దాట్ల దేవదానం రాజు. పి. సుబ్బారావు, పి. రాంబాబు, డా॥ అద్దేపల్లి, బండి ప్రసాదరావు.



కరీంనగర్ జిల్లా కోరుట్లలో సినారె కళాభవనం వేదికపై భారతీసాహిత్య సమితి, అభినవ పోతన శతజయంతి ఉత్సవ సమితి సంయుక్త ఆధ్వర్యంలో జరిగిన వానమామలై వరదాచార్యుల శతజయంతి సభలో కీ॥శే॥డా॥ అందె వెంకటరాజం రచించిన "కళాతపస్విని" పద్యకావ్యాన్ని ఆవిష్కరిస్తున్న శాసనసభ్యులు కల్వకుంట్ల విద్యాసాగర్‌రావు. చిత్రంలో డా॥ వద్దేపల్లి కృష్ణ, డా॥ రావికంటి వసునందన్, కృతిస్వీకర్త శ్రీ తాళ్లపల్లి మురళీధరగౌడు, డా॥ తిరుమల శ్రీనివాసాచార్య, డా॥ జె. బాపురెడ్డి, తుల ప్రభాకరరావు, వానమామలై రవీంద్రాచార్యులు తదితరులు ఉన్నారు.



జూన్ 17న రామప్ప గుడి ప్రాంగణంలో రామప్ప ప్రజా విజయోత్సవ సభ సందర్భంగా "విధ్వంసం కోరల్లో రామప్ప" కవితా సంకలనం ఆవిష్కరిస్తున్న తెలంగాణ రచయితల వేదిక అధ్యక్షుడు జూలూరి గౌరిశంకర్. చిత్రంలో ప్రముఖ విద్యావేత్త చుక్కారామయ్య, యం. వేదకుమార్, వి. ప్రకాశ్ పుస్తక సంపాదకులు నల్లెల్ల రాజయ్య, రమాదేవి, అడపా సత్యనారాయణ.



గుంటూరు జిల్లా పిడిగురాళ్ళలో న్యూవిజన్ సంస్థ అధ్వర్యంలో జూలై 15న మహిళా భ్రూణ హత్యలపై జరిగిన సభలో ప్రసంగిస్తున్న అద్దేపల్లి రామ్మోహన్‌రావు. చిత్రంలో వై.హెచ్.కె. మోహన్‌రావు, శ్రీమతి పున్నం దీపికా, డా॥ భువనేశ్వరి, శ్రీమతి సుమిత్రాదేవి, డి. ఏడుకొండలు తదితరులు.



జూలై 15న మహబూబ్‌నగర్ జిల్లా, అచ్చంపేట తాలూకా కేంద్రంలో పెన్షనర్ భవన్‌లో జరిగిన ఎం.ఎ.గఫూర్ రచన 'ప్రజా ప్రస్థానం' ఆవిష్కరణ సభ. చిత్రంలో ఎ. గఫూర్ డా. బందం బాలు నారాయణ, మల్లేపల్లి శేఖర్ రెడ్డి.



హైదరాబాద్, త్యాగరాయ గానసభలో సాహితికిరణం వార్షికోత్సవ కవితల పోటీలో బహుమతి అందుకుంటున్న కవి ఎస్వీ, రఘువీర్ ప్రతాప్ వేదికపై గుడిబండి, బైసాదేవదాస్, సమాచార శాఖ కమీషనర్ విజయబాబు, కళా దీక్షితులు, పొత్తూరి సుబ్బారావు తదితరులు



తేజ ఆర్ట్స్ ఆధ్వర్యంలో 2010, 2011 సంవత్సరాలకు గాను ఉత్తమ నానీల పురస్కారాలను సరికొండ నరసింహరాజు, మేరెడ్డి కవులకు హైదరాబాద్‌లో అందజేస్తున్న డా॥ సి.నారాయణరెడ్డి. చిత్రంలో డా॥ పోరెడ్డి రంగయ్య కళా వెంకట దీక్షితులు, డా॥ సి. భవానీ దేవి, డా॥ ఎన్ గోపి, ఎం. ధనంజయ నాయక్ ఉన్నారు.

# పొగ చూరిన ఆకాశం ఆంగ్లానువాదం ఆవిష్కరణ




'పొగచూరిన ఆకాశం' అద్దేపల్లి కవితా సంపుటి ఆంగ్లానువాదం 'ఐ నీడ్ ఎ లెటర్' ఆవిష్కరణ సభ. చిత్రంలో రమణశాంతి, నోముల సత్యనారాయణ, అద్దేపల్లి రామమోహనరావు, తెలకపల్లి రవి, అంపశయ్య నవీన్, సుధామ.

సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జూలై 10న సుందరయ్య విజ్ఞాన కేంద్రంలోని దొడ్డి కొమరయ్య హాలులో డా॥ అద్దేపల్లి రామమోహనరావు రచించిన ''పొగ చూరిన ఆకాశం'' ఆంగ్లానువాదం" "ఐనీడ్ ఎ లెటర్" గ్రంథా విష్కరణ సభ జరిగింది. ఈ సభకు ప్రస్థానం సాహిత్య మాసపత్రిక సంపాదకులు తెలకపల్లి రవి అధ్యక్షత వహించారు. పదేళ్ళ క్రిందటే ప్రపంచీకరణ దుష్పరిణామాల్ని పసిగట్టి కవిత్వకరించిన ఈ పొగ చూరిన ఆకాశం గ్రంధాన్ని తమ సంస్థే ఆవిష్కరించిందన్నారు. ఈ సంపుటికి దక్షిణ భారతదేశంలో ప్రతిష్ఠాత్మక చిన్నప్ప భారతి పురస్కారం లభించడం ముదావహమని కన్యాశుల్కం అంగ్లీకరణకు 13 ఏళ్ళు పట్టిందని, తెలుగు క్లాసిక్స్ ఇతర దేశాల్లో చూడాలంటే ఆంగ్లానువాదం అవసరమని, అద్దేపల్లి కవిత్వాన్ని ప్రపంచానికి పరిచయం చేయటమేగాక ప్రపంచీకరణ చెడును మూలభావం దెబ్బతినకుండా ఆంగ్లీకరించిన శాంతి రమణ అభినందనీయుడని అన్నారు. ఈ గ్రంథాన్ని ఆవిష్కరించిన డా॥ నోముల సత్యన్నారాయణ మాట్లాడుతూ... ప్రపంచ సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లో పారంగతుడుగా విశ్వనాథ సత్యన్నారాయణను పేర్కొంటారు. ఆంగ్లంలో గోల్డ్ స్మిత్ ఐతే ఆంధ్రలో అద్దేపల్లి అని అన్నారు. ఆంగ్ల విమర్శకుల్లో టి.ఎస్ ఇలియట్ అంతటివాడుగా అద్దేపల్లిని ఆయన పేర్కొన్నారు. అనంతరం అంపశయ్య నవీన్ మాట్లాడుతూ మన తెలుగు సాహిత్యానికి ప్రపంచ వ్యాప్తంగా మంచి గుర్తింపు రావడంలేదని, రెండు వేల సంవత్సరాల చరిత్ర కల్గిన మన భాష నేడు చాల దయనీయంగా వుందని. అమెరికాలో వెల్చేరు నారాయణరావు అక్కడి వారిని దృష్టిలో పెట్టుకొని అనువాదాలు చేస్తున్నారని అన్నారు. అద్దేపల్లి ప్రపంచీకరణ వ్యతిరేక భావాల్ని, కవి హృదయాన్ని శాంతి రమణ గొప్పగా ఇంగ్లీషులో ఆవిష్కరించారన్నారు. డా॥ సుధామ మాట్లాడుతూ హిందూయిజం అమెరికనిజం అయిందని, ఆటా,తానా సభల్లో పాల్గొనటమే తెలుగు కల్చర్‌గా చెలామణి అవుతోందని, అమెరికాలో వున్నవాళ్ళు మన తెలుగు కల్చర్‌ను కాపాడుకోవాలి అనేదే అద్దేపల్లి ఆలోచన, ఆవేశం, ఆక్రోశం అని అన్నారు. రమణ అనువాదంలోని కొన్ని కవితల్ని 'సుధామ' జనరంజకంగా చదివి వినిపించారు. గొప్ప ధార ఉన్నదనీ, దాన్ని ఆంగ్లంలోకి తేవడం ముదావహం అని సుధామ అన్నారు. శాంతి రమణ చక్కని అనువాదం చేసాడని, తన స్పందనలో అద్దేపల్లి అన్నారు. తనకు ఆంగ్లం చాలా ఇష్టమని తనకు నచ్చిన కొన్నింటిని మాత్రమే పొగచూరిన ఆకాశం నుండి తీసుకొన్నానని, లెటర్ అన్న పదంలో అక్షరం, ఉత్తరం అర్థాలు స్ఫురిస్తాయని, ఎంతో స్పందనతో తానీ అనువాదం చేశానని శాంతి రమణ అన్నారు. ఈ సభకు సాహితీ స్రవంతీ రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ స్వాగతం చెప్పారు. జి. యాదగిరిరావు, శాంతిశ్రీ, వి.వి. ఆర్.కె. శాస్త్రి, తంగిరాల చక్రవర్తి తదితరులు ఈ సభను పర్యవేక్షించారు.

**– తంగిరాల చక్రవర్తి**

# గజపతి నగరంలో సాహితీస్రవంతి

"సహితస్య హితం సాహిత్యం" ఆర్యోక్తి సమాజం యొక్క హితాన్ని కోరుతూ, సామాజిక స్పృహతో సామాజిక ఇతివృత్తంతో చైతన్యమే తన ఊపిరిగా కవితా ప్రస్థానంతో దూసుకుపోతున్న స్రవంతి సాహితీ స్రవంతి అని వక్తలు పేర్కొన్నారు. జూలై20న విజయనగరం జిల్లా గజపతినగరంలో హర్షవర్ధనా హైస్కూల్‌లో కార్యక్రమాన్ని సాహితీస్రవంతి ఆధ్వర్యంలో తొలిసారిగా కార్యక్రమం జరిగింది. ఈ సదస్సు సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ చీకటి దివాకర్, శ్రీహరి రాజు, జి.యస్.చలం, పాయల మురళీకృష్ణ, పి.రమణమూర్తి మొదలైన సాహితీమిత్రుల ఆధ్వర్యములో జరిగింది. సాహితీస్రవంతి ఆవశ్యకత, సంస్థకార్యాచరణ ప్రణాళిక, మౌలికసూత్రాలు, నూతన కవులకు మార్గదర్శకత్వము మొదలైన అంశములపై చర్చించి మిత్రుల అభిప్రాయాలను స్వీకరించి తదుపరి కార్యక్రమ నిర్వహణ ఆగస్టు 17వ తేదీన నిర్వహించుటకు నిర్ణయించుకున్నారు. ఈ కార్యక్రమంలో సాహితీ మిత్రులు తవ్వా అనంతరావు, శ్రీమతి శ్యామల, శ్రీమతి కొల్లూరి పద్మజ, మన్మథరావు, అయోధ్యరామ, వాసు, శంకర్రావు తదితరులు పాల్గొని తమ తమ అభిప్రాయాలను తెలిపారు. జి.యస్.చలం మాట్లాడుతూ, హంగులూ, ఆర్భాటాలకు, పొగడ్తలకు, అభిప్రాయ బేధాలకు తావు లేకుండా కవితా ప్రసక్తికి ప్రాధాన్యమిస్తూ నిర్వహించుకుందామని తెలిపారు. నూతన రచయితలకు ప్రోత్సాహకరంగా ఉంటుందని కార్యక్రమ నిర్వాహకులు పాయల మురళీకృష్ణ తెలియజేశారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

# గిడుగు రామమూర్తి

29. 08. 1863 - 22.01.1940



వ్యావహారిక భాషోద్యమ పితామహుడు; సవర భాషా వాగనుశాసనుడు; మేధావి; తెలుగుదేశపు భాషా శాస్త్రవేత్తలలో ప్రథముడు; మహాపండితుడు.

SAHITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/10-12



# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల: రూ. 40/-




వెల: రూ. 200/-




వెల: రూ. 25/-




వెల: రూ. 30/-




వెల: రూ. 40/-




వెల: రూ. 40/-




వెల: రూ. 35/-



వెల: రూ. 20/-




వెల: రూ. 150/-




వెల: రూ. 20/-




వెల: రూ. 50/-



వెల: రూ. 100/-




వెల: రూ. 20/-




వెల: రూ. 150/-




వెల: రూ. 200/-



వెల: రూ. 35/-




వెల: రూ. 40/-




వెల: రూ. 20/-




వెల: రూ. 50/-




వెల: రూ. 150/-

ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02 1640 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | K Daveed |
| పేజీలు విడదీసినది | K Daveed |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |